

శ్రీ జువ్వాడి గౌతమరావుగారు
క రీం న గ ర ము

అంకితము

శ్రీ జువ్వాడి గౌతమరావుగారికి

కరీంనగరము

నిజమునకు భావుకుం డని
సృజనన్ బదివేలమంది నెవ్వఁడో యొక్కం
డు జనించు, మెఱయు వానికి
రజనీపతి కాంతి భ్రూభర మ్మపు డపుడై.

వారిలో నొక్కరుండు జువ్వాడి వంశ
రజనికాంతుండు గౌతమరా వనంగ
కవికినట్టిడు నొకచెలికాడు దొరకు
తొలుతటిజనుస్సులందలి చెలిమికాడు.

విశ్వనాథ సత్యనారాయణ

## ఒక మాట

నేను పూర్వము వ్రాసిన ఖండకావ్యములు ఎన్నో లెక్కలేదు. సంకలనము చేయఁబడలేదు. కొన్నిటిని శ్రీ గౌతమ రావుగారు సంకలనముచేసిరి. వానిలో 1916 మొదలు 1926 వరకు వ్రాయబడినవానిలో దొరికిన కొన్ని యివి. ఆంధ్ర ప్రశస్తి, కిన్నరసాని పాటలు, గిరికుమారుని ప్రేమగీతాలు, ఏకవీర, నర్తనశాల, విశ్వేశ్వర శతకము. 1926 లోపుగా వ్రాసినగ్రంథములే. గ్రంథములుగా రూపుకట్టించుటకు వీలు లేని శీర్షికలు మిగిలినవి. ఇందులో నొకటి రెండు శీర్షికలు 1926 దాటినవికూడఁ గలవు.

## భ్రష్టయోగి

మన్మహాయోగనిష్ఠాసమాధినుండి
వాగతీతమ్మ యగు పరబ్రహ్మమహాతి
మృదుగిరాం సౌకుమార్య మూహించుకొనుచు
భ్రష్టయోగిని కవిజన్మ బడసినాడ.

మన్మహాయోగనిష్ఠాసమాధినుండి
విక్రియాపేతబ్రహ్మ భావించువేళ
పట్టరాని సౌందర్యపిపాస తగిలి
భ్రష్టయోగిని కవిజన్మ బడసినాడ.

మన్మహాయోగనిష్ఠాసమాధినుండి
బ్రహ్మబదులుగ వాక్స్వరూపంబు నెంచి
బ్రహ్మకును వాక్కునకభిన్నభావ మెంచి
భ్రష్టయోగిని కవిజన్మ బడసినాడ.

మన్మహాయోగనిష్ఠాసమాధినుండి
బ్రహ్మ జగదతీత మను భావంబు లేక
ఈ జగత్తత్త్వమున బ్రహ్మ యోజచేసి
భ్రష్టయోగిని కవిజన్మ బడసినాడ.

## మా స్వామి

ఇవి విశ్వేశ్వరశతకము (మా స్వామి) లోని ఏడుపద్యములు.

ఇవి 1916 లో వ్రాసినవి.

ఈ శతకము 1926 లో పూర్తిచేయబడినది.

మొదటి రెండుపద్యములు తరువాత నా శ్రీమద్రామాయణకల్ప
వృక్షములో మొదట చేర్పబడినవి.

శ్రీమంజూషిక, భక్తరక్షణకళా శ్రీచుంచు, వానందవ
న్మంజుప్రసవంబు, చిద్గగనప్రాలేయాంశువున్, మోక్షల
క్ష్మీమాణిక్యవినూత్న మేఖల, కటాక్షీభూతనీహారరుక్
శ్రీమంతంబయి పొల్చు వెల్గు నొకఁడే సేవింతు విశ్వేశ్వరా!

కైలాసాచలసానువాసము, వృషస్కంధాగ్రసంస్థాయి, త
త్ప్రాలేయాచలకన్యకాకుచతటీపర్యంకనిద్రాగతం,
లాలోలాగ్రజటావనీఘటితనాకౌకస్సరిత్కంబు, దే
హాలంకారితలేలిహానము, వెలుం గర్చింతు విశ్వేశ్వరా !

శ్రీనీహారనగాధిరాజతనయాస్నిగ్ధాననాంభోజని
త్యానందైకపరుండు, గాంగఝరనిత్యస్నాత, రాకానిశా
మానాంగీశశిరోవిభూషణుఁ డటంచున్ నిన్ను ధ్యానింతు భ
క్తానీకంబుల పైపయిన్ గరుణరాదా నీకు విశ్వేశ్వరా !



తలపైఁ జాబిలి నిమ్మళించి యుసు వేదశ్వాసముల్ ముందు న
మ్ములు నున్ మున్ముసవింటి బద్ధయుఁగ రాంభోజాతయుగ్మంబు నన్
ములరాఁకూరురు బోయసాని వెను వెంటన్ రాఁగ మాయామృగ
మ్ముల వేఁటాడుఁ బుళిందరాజ నిను సంపూజింతు విశ్వేశ్వరా !

చలిమిన్నేటి కెలంకులందు సొగసుం జాబిల్లి పూరేకవం
కలు సింగారముగా వసుచ్చి చెవులన్ గంపింపఁగాఁ బాఁపపో
గులు మేనన్ బులితోలు పై చుకొని కొంగుల్ జార ప్రేమం పుజా
పుల సంధ్యాసతిఁ జాచు నీసొగసు మమ్మున్ బ్రోచు విశ్వేశ్వరా!

కరితోలుప్పట్టము కొంగుతోఁ బునుకభిక్షాపాత్ర చేఁబూని సం
స్కరణం బించుక లేమి మైజడలు మూఁగన్ జొట్ట పిల్లాఁకటన్
సురుగన్ మున్మొనకఱ్ఱతో దడుముకొంచున్ లచ్చి గేహంబు ముం
దర నిల్చున్ భవదీయభిక్షుకత కంతం బెప్డ విశ్వేశ్వరా!

ఓ సామీ! అలకొండకో మెతకు నీయొయ్యారమే బూదిపూఁ
తే సర్వంబయి నీకు నా యుమ సొబంగే వచ్చి కన్నారు ర
య్యా! సంతానము నేన్గుమో మొకఁడు వింతౌ నాగ్గొ గాలొక్కఁడో
హో! సొరాపద కాకరుం డొకఁ డదేమో కాని విశ్వేశ్వరా?

# గురుస్తుతి

[వెనుక నెప్పుడో బందరులో గురువులైన శ్రీ చెళ్ళపిళ్ళ వెంకట శాస్త్రిగారును, శ్రీ కాశీ కృష్ణాచార్యులుగారును సన్మానింపబడినప్పుడు వ్రాసినపద్యములు]

సొగసు మీమేన కస్తూరికావాసనా
శ్రేణిక పరిమళించినది తెలుగు
మీముఖాంభోజాతరామణీయకములో
దాగుకొన్నది శారదాహసితము
విద్యాపురీరాజవీథులలో బడి
కదలవచ్చినది మీకడకు కవిత
ఆంధ్రమాతృక మీదు నల్లికలందున
మురుసుకొన్నది స్వీయమూర్తి చూచి
ప్రకృతి సంపెగయైనది భవదమోఘ
చాతురీవాగ్వనంబున శత్రుమధుప
బాలురకు శిష్యకోటిభావమ్ము తావి
యయ్యె దాన సంతర్లీన మగుచు బుధులు.



లంపులమారి ధూర్తకవులన్ గికురింతలు సేయు నేర్పు సె
ల్లింపులు మీకె దక్కెనవిలే తొలుకారు మెఱుంగుటందపున్
మంపెసలారు గొజ్జెగ సుమాళపు మీకవనంపునీటులో
జంపుల పల్లెకాపుసరజాణల యయ్యెలలూపు లూచెబో.
నిదురించు ప్రియురాలిమెదత్రెంచుకొనిన య
ద్వయవాది ప్రథమసాధనపరీక్ష
పద్మంపువ్యూహ మాపద్మగన్నులను చేయు
కొడుకుతండ్రుల ముంచుకొనినముసురు
నవకంబు నెరపె మానససరఃప్లవమాన
రాజహంసీగరుద్రమలదాల్చి
మీదివ్యలేఖినీస్వాదుభాగీరథీ
శ్రీవాఃప్రపూర్ణరోచిస్సులందు
తుంగభద్రను రాజకూతుళ్ళ స్తనమృ
గీమదద్రవవాసనాక్రీడ మరచి
గౌతమీకృష్ణవేణీప్రకాశమాన
వాఃకణమ్ముల మఱగె మీవలన కవిత.
* రంగురంగుసొబంగుహంగుపచ్చళ్ళమీ
యెంత తెల్పొ కచం బంత నల్పు
మామనంబుల యయోమయము లేమైన సూ
దంటుటావోలిక నంతలోన

---

* శ్రీ కాశీ కృష్ణాచార్యులుగారి ఒక పద్యములోని మాటలు.

ప్రహ్వీకరించె విద్వల్లోకమణి నీదు
నవధానచాతురి యల్లుకొనియె
లతవోలె తెలుగునేలను నాల్గుచెఱగులు
మాధ్యులందు సంపత్తువోలె
సుకవితాబాల కది యెంత సోకొగాని
తలనరసి ప్రాయముడిగిన తమ్ముగాక!
రచ్చకీడ్వదటే! యెంతరాలుగాయ
నొవ్వ ప్రోగగ తనమొలనూలిగంట.



## ఏ లో ?

తేనియలు జార్చు నే యన్న మైనగాని
కోకిలకుహూరవమ్ములకున్, మురిపెపు
గ్రొత్తమావి చిగుర్చుటకుం గలట్టి
ప్రకృతిరాహస్యదివ్యసంబంధ మేలొ ?

మనుజునిహృదంతరాళమ్ము మదవతీవి
లోచనాకృష్యమాణమై పూచినట్టి
సన్నవిరజాజిపూతీవ చెన్నువోలె
వాసనాదుర్బలత్వమ్ము వరపు టేలొ?

ప్రాతరున్మీలితాంచితాబ్జాతచలద
లీ రవామోదరసధునీలీలలకును
నన్య మెఱుగంగలేని చైతన్యహీన
మైన ప్రకృతిస్వరూపసంధాన మేలొ ?

బండిగురివిందపూదీవ నిండుకోర్కి
ప్రాజ్యయౌవనసామ్రాజ్యపట్టభద్ర
తాసముత్సాహమిలితకాతర్యమైన
తరుణి తాంబూలరాగంబు తగులు టేలొ !

శరదమలమేఘమాలికాసముదయంబు
కన్న ప్రళయావసానదుష్కాలతీవ్ర
మారుతముకన్న మనుజుని మనసునకును
గలిగియుండినయట్టివేగ మ్మ దేలొ ?

## ముషితబుద్ధి

అపునవున యోరి మిథ్యాసుఖాభిలాషి !
కైతవాభినయమ్ము లభూతకల్ప
నలు పౌనర్చ్భడు తత్త్వవిహీనబుద్ధి
నిన్ను నీవ హరించుకొంటి వని యెఱుగ.

ఆ గగనవిలంబితమఃపరాగనిచయ
పరివృతంబైన యద్దానిపైన నీకు
భ్రాంతిపొడమెను బాల్యచాపలమువలన
పావుర మ్మని చిరుగాలిపడవ యనుచు.

అది భవత్ప్రాణవాయుచయంబునందు
క్షిప్రపస్వబలాత్సమాకర్షకప్రభావ
పటుతరసముద్ధవిషమవత్ పన్నగంబు
పాప మేమందు బాల్యచపలుఁడ వీవు.

సతము నేను నిద్రాతిరస్కృతుఁడ నౌచు
దుష్టమాయాముషితబుద్ధితో సుషుప్తి
నిరతిశయమహానంద మని మది నెంచ
నొక మహావాక్కు నా కిట్లు లుపదిశించె.



## నా పాట

చల్లనైయున్న నాహృదబ్జమ్మునుండి
తలవనితలంపుగా నొక్క లలితగీతి
జాలువారి యీ మంజులోషస్సువేళ
విరిసికొన్నది మంచుతుంపురులయందు.

ఆ లలితగీతి పోయి దిగంతములకు
నిశ్చలంబైన ప్రకృతిలో నిలువలేక
అల్ల ఉపసంహృతమ్మైన యస్త్రమట్లు
నేను పాడిన పాట నన్నే వరించె.

## అనుగంత

కదలగ నీవు నన్ను వెనుకంబడి నిచ్చలు కాచియుందు, న
న్నదిమెదు మూలమూలలకు, నాపయి నీ వొకకన్ను వేసియుం
చె దెవరు నీవు ? తప్పొకఁడు చేసిన దేమియు లేదు నేను, పూ
నెదు నయనాంతర క్తిమము నీకు ఋణంపడికూడ లేను పో!

నీహృదయభేదమైన దృజ్ఞివహ మిదియు
ఉఱియతన మేల నే నిది యోర్వజాల
ఊరక నను వెంబడించెద వోసరిలుము
అస్మదీయపథ మ్మదృశ్యానుగంత.

ఇది ప్రియురాలు నామెద హరించిన చాన వసించుమేడ యిం
దొదిగి చరించి యామెఁగని యూఱటపొందగవచ్చినాడ, న
న్నదుముకువత్తు వెంటబడి, యా, సరి నాపొనరించినట్టి త
ప్పది వచియింపు, కాదనెదవా, ఋణమేమియు నీకు లేనుగా.

నామెద వేసఁగిన్ జివురునా నిది నోవసివాళ్ళవాడె న
జ్ఞేయముగా బొనర్పబడెనేమొ యెదేనియు తప్పు పూర్వజ
న్మాయితమైన తీర్చనిఋణం బది యేదయినన్ ఘటిల్లెనో
ఆ యిదమిత్థ మేర్పరుపనట్టిది నామెద తల్లడిల్లెడున్.



## పసివాఁడు

ఏను మారాముపెట్టి పెల్లేడ్చుచుంటి
నేడు పుడిపింప మాతండ్రి యివి యవియును
నిచ్చె, నవి పారవేసి నే నేడ్చుచుంటి,
నేడ్చుచుంటిన యాయన యెత్తుకొనిన.

ఎత్తుకొనిపోయి నను రాజగృహముకడకు
పట్టపేనుగు జూపి 'నాపట్టి! నీకు
దానిపై నెక్కఁగా నిచ్చెదను సుమన్న !
ఊరకుండు' మటంచు న న్నూఱడించె.

ఏడ్చుటను మాననేలేద యేను, తండ్రి
యంగడికిఁ దీసికొనిపోయి యచట నాకు
ముచ్చచేసిన రంగులపచ్చిపేడ
బొమ్మ కొనియిచ్చె నాయేడు పుపశమించె.

## భవిష్యత్తు

నడచుచున్నపథంబు కంటకశిలావృ
తంబు, కటిక చీకటి పైన, దారిసుంత
నాకు దోచదు, లాగుచున్నదియు నన్ను
కాలశైవలి న్యావర్తగర్భమునకు.

సురిగిపోయితి నంచు నెంచుకొనులోన
ముందు దూరాన కనవచ్చె పురుషుఁ డొకఁడు
శతసహస్రమార్తాండ తేజస్సహితుఁడు
హృదయబాధానివారణమదనమూర్తి.

అతిప్రయాసంబుమీద నే నతనియున్న
తావునకు బోయి పడితి, నతం డదేమొ
అంజనావనీధర మట్టు లతిభయంక
రాకృతి వహించె, నాకు భయంబు తోచె.

పరుగులెత్తి మిక్కిలి దూర మరిగి వెనుక
తిరిగి చూచితి, నా చిత్రపురుషుఁ డేలొ
నన్నుగని శాంతముగ నిల్చి నవ్వుచుండె
నా కతనినవ్వు దోచె స్వప్నంబువోలె.

వివిధసూచీముఖోపలవిషమమైన
మార్గమున బోవుచుంటిని మరల నేను
ఇటుల జూతునుగద, ముందు నీ పురుషుఁడె
అతిమనోహరమూర్తి న న్నాహరించు.



## ఒక్క పుస్తకము

నా కొకవిషజ్వరము వచ్చినది, మెలుకను
నన్ను నేన, మంచమ్ముపైనఁ బడియుంటి
నాజనని 'మందు త్రాగు' మన్నది, 'విషమ్ము
నా కది, గ్రహింపజాల' నన్నాను నేను.

ఆమె యచ్చట కూర్చున్న దంతలోన
కొంచెముగ నాకు పైత్యపుకునుకు పట్టె
కాళ్ళవైపున బల్లపై కలద యొక్క
పుస్తకము, చూచుచుండ నాహస్తమునకు

కనులు వచ్చెను, తలయును కానిపించి
కోఱ లేర్పడి యాసురాకార మొప్పి
మృదుహాసితమందు విసమును పదిలపరచి
చెలువుగులుకంగ నన్ను భాషింపజొచ్చె.

నాకు తెలిసిన సర్వవిజ్ఞానములును
తనకుగాని తెలియవట ! దానిమాట
వినియ నే మనవలె నట ! విశ్వగామి
నామనసు జ్ఞానశూన్యసంతమసమంట !

నాకు కోపమువచ్చి తన్నంగ లేచి
నిలబడితి, నంత మాతల్లి 'కలతపడెదు
తండ్రి ! యేమిర !' యనియె, నాతప్పు తెలిసె
పుస్తకము బల్లపైనుండె పుస్తకముగ.

## విస్మృతి

మాగృహముమూల కలద యా మందిరంబు
అందు నాదేవి నిత్యంబు నవధరించు
దివ్యచక్షూరహిత, స్థూలదేహ, నిత్య
కారణవిహీనహాసవికాసవదన.

ఆ వికృతహాససమ్మోహనాస్త్రపాత
వివశులము నవ్వుచుందుము వెర్రుల మయి
శత్రునికృతుల మాలోన జన్యమైన
ఈ మహాగ్నులు మమ్ము దహించుచుండు.

ఆ వికృతహాససమ్మోహనాస్త్రపాత
వివశులము నవ్వుచుందుము వెర్రులమయి
ఆత్మబోధోపహతులమై యంధకార
మెదుగుచుండు మాలోన మామెరుక లేక.



## నేస్తు

అగు విషాగ్నిగర్భితమైన యంబురాశి
యీ ప్రపంచము జనము లి ట్లేగుదెంచి
స్నేహితులవోలె నాయెడ చేసినట్టి
యపకృతులచేత నాహృదయంబు తునిసి

శాంతి గనలేక సర్వదిశాసముదయ
మందు తిరుగాడి తిరుగాడి యా వనాంత
సీమ చేరితి, నచ్చోటి చిన్నియూట
నాకు జన్మాంతరమ్ములనాటి నేస్తు.

అల్ల సెలయూటతో సొదవెళ్ళబోసి
కొంటి, దనరావమున కల్పుకొన్న దదియు
నావిచారాంబువులు, వచ్చినాడ దిరిగి
సరకుదింపిన చిరునావకరణి నేను.

## అంధబిక్షువు

అతఁడు రైలులో నే బోయినప్పుడెల్ల
నెక్కడో ఒక్కచోట దా నెక్కు - వాని
అతనికూతురు నడిపించు ననుసరించు.
అతఁడు దాశరథీశతకాంతరస్థ
మైన యా పద్యమె పఠించు ననవరతము
అతని యా గొంతు కట్లనే - అతఁడు పూర్వ
జన్మమందు నే నూతిలోననో చచ్చిపోవు
చెంత పిలచిన వినువార లేని లేక
ఆ పిలుపు ప్రాణకంఠమధ్యములయందు
సన్నవడి సన్నవడి నేటిజన్మ కతని
కనుచు వెదకుచు వచ్చిచేరినది కాక
అతనికన్నులా బొత్తిలే - ఆ సమయము
నందు తన్ను రక్షింప నేరైన వత్తు
రేమొ యని చూచిచూచి యట్లే నిలబడి
అతనిప్రాణాలు కనుగూళ్ళయందు నిలచి
మరల గనెగాక నేటిజన్మమున నతని
అతనిపాడినయంత నే పల్లనట్టి
యతనికన్నులు చూచినయప్పుడెల్ల
నూతిలో మున్గు నాతని తీతు నంచు
వేగిరముపుట్టు నాదు హృద్వీథియందు
అంతలో పాట నాపి తా నచటనచట
కాను లడిగి కూతురు ముందుగా వినిర్గ
మించునాతఁడు - నే నందు మిగిలిపోదు.



## స్వామి

స్వామి ! పరిగాఢశర్వరీచ్ఛవి దరిద్ర
తానిధానము తేజోవిహీన మనవ
రతపరిస్రుత బాష్పధారామిళితము
నన్ను నీ వుండుమ న్నంగణంబు, తండ్రి !

ఈ మహాంధకారంబున నెపుడో యొక్క
సారి మెఱసితి వా నాడు సామి ! నాకు
టీర మానందవాయుప్రచారశత స
హస్రకుసుమపరీమళవ్యాపృతంబు.

దానితో సరి, మరల నాంధ్యమ్ము క్రమ్మె,
తొలి చివఱ లేని యీ చీకటులును నేను
ఒక్కఒరొక అప్పళించుకొం చుండినాము,
నిన్ను, నీ నాటి మెఱపు మన్నించుకొంచు.

## నీ రథము

ఓ ప్రభూ ! నీ రథమ్ము దీప్తాప్రణీత
విధురవేగమ్ము పరువులువెట్టుచుండె
నాశరీరము దానిక్రింద బడి నలిగి
నలిగిపోయినయది రక్తనదము లింకి.

దివ్యతేజోవిరాజత్త్వదీయరథము
ఈ గతుకు డేమి యనియైన నాగలేదు
నావిరోధించిన హతాన్నినాదమునకు
వెనుదిరిగియైన మఱి చూచుకొనగ లేదు.

నాదురక్తము నీరథచోదకుండు
కడిగివేయును రేపు చక్రములనుండి
అచటి బహుజనరక్తచిహ్నములయందు
నాది యిదని గుర్తేమి కన్పడును, స్వామి !



## వెలుఁగు గడప

అపుర ! ఓ నాప్రభూ ! వచ్చినట్లె వచ్చి
నే గడపదాక నరుదెంచి నిన్ను జూచు
విధృతి వృథయుగా మొగముదప్పించినావు
అపుర ! ఓ నాప్రభూ ! వచ్చినట్లె వచ్చి.

పొరపడితి నందువా ! నీదుపాడయు నెఱుఁగ
వేసికొన్నవత్తులుగాగ వేచికొనెడు
నాకనులు నమ్మరా దందువా కడింది
వెలుగు నాముంగిటను గిలాబులు రచింప.

నీవుగాని రాకున్నచో నిభృతము లగు
జిలుగుసౌదామనీసరస్సుల వెలుగులు
సర్వవస్తుచ్ఛవుల్ పరాస్తమగునట్టి
నడకగల జిల్గులో త్తైడు నాగడపకు.

## దయాంబుధి

నాకనులమెట్టయెదుటన నాజనకుని
జనని కుత్తుకలను కోసి నను నడిగె న
తండు 'నే దయాంబుధిని కాదా?' యటంచు.
'ఓ ప్రభూ! యగు' నంటి నే నొదిగియుండి.

నాకనులమెట్టయెదుటన నాలతాంగి
ప్రాణములు నిల్వ్వనందీసి యడిగె నను న
తండు 'నేదయాంబుధిని కాదా?' యటంచు
'ఓ ప్రభూ! యగు' దంటి నే నొదిగియొదిగి.

నాకనులమెట్టయెదుటన నాయనుంగు
తనుజకుత్తుక నులిమి తా నను నడిగె న
తండు 'నే దయాంబుధిని కాదా?' యటంచు
'ఓ ప్రభూ! నీవ' యంటి నే నొదిగిపోయి.



## కిన్నెరసాని

వనములను దాటి వెన్నెలబయులు దాటి
తోగులను దాటి దుర్గమాద్రులను దాటి
పులులయడుగుల నడుగులు కలుపుకొనుచు
రాళ్లవాగు దాటి పథాంతరములు దాటి.

అచట కిన్నెరసాని - నాయాత్మయందు
నిప్పటికి దానిసంగీతమే నదించు
ముక్తరోధోచ్ఛసైకతంబుల పసిండి
చాయలను ముగ్ధవనలక్ష్మి చాదుకొనిమె.

ఆ భయంకరాటవులమధ్యంబునందు
ఆ మహావ్యాఘ్రపాదచిహ్నములయందు
ఆ కుటిలమార్గములయందు నమృతశాంత
మైన గీతిక కిన్నెరసాని మ్రోయు.

ఉరక ర మ్మందు వెవ్వర వోయి నీవు
పులులు వచ్చును బో నీరమును గ్రహింప
ఎగువ పర్వతాగ్రముల వర్షించి ఝరిణి
అగును లెమ్ము జలప్రళయమ్ము పొమ్ము.

అసువు లీ దేహమందు నున్నంతవరకు
నేను విడలేను కిన్నెరసానివాగు
నామనస్సును' లాగుకొన్న దది లోక
దివ్యమోహనముగ బాడి తెనుగుపాట.

ఓయి ! రసహీనుఁడా ! కాలువా యిది ? సరి
నిడివిగా ద్రవ్వె నేమి దీని నెవఁడేని?
తెల్లత్రాచుచకచ్చకదీప్తి పోలుచు
మేన చనునట్లు కిన్నెరసానివాగు.

రెండువైపుల వ్యాఘ్రదరీవృతమ్మ
యయిన యడవిని చూపి భయమ్ముపెట్టె
దగును మృత్యువును జయించినపుడెకాని
యమృతకలశమ్ము నీచేతి కందబోదు.

ఏమి నే నింతగా వచియించుచుండ
నాననంబున నది మందహాసముద్ర
అవునులే, నిక్కువమ్ము నీ కది తెలియదు
ఎంత సంస్కారముండిన నెఱుగవలయు ?

ఇతరదేశమ్ములను ప్రవహించునదుల
జూచి కిన్నెర నట్లుగా జూడవలతు
తెనుగువంపు తెనుంగుమెత్తన తెనుంగు
ప్రతిభ కిన్నెరసానిలో ప్రతిఫలించు.

చాలు నింక ననాంధ్రసంస్కారరహిత
బుద్ధి కిన్నెరసానిపై పోవనిమ్ము
ఆంధ్రనది గౌతమీప్రవాహంబునకును
నిత్యజీవనదాత్రి కిన్నెరలసాని.



## నక్షత్రాలు రెండు

వ్రేగగు హైమసౌధమణివీథిక పుట్టెను రాచబిడ్డ క
ల్పాగమువోలె నేల విరియంబడి బంగరుముద్ద లే దెసన్
త్యాగము పొందె, వారసతు లాడిరి, ముంగిట తూర్యరావముల్
మ్రోగెను, లోకపుంజనులు బోరన సన్నుతిపెట్టి రెంతయున్.

ఒక్కచిఱుపేదగుడిసెలో నుద్భవిల్లి
నాడు కవికూన; పదియవనాడు మంత్ర
సాని దెప్పిన దన్నము చాల దంచు;
మంత్రమో, సణ్గెనాడో, బ్రాహ్మణుఁడు వచ్చి.

ఆ రాచబిడ్డకల్యాణపల్యాణ స
జ్జితపంచకల్యాణి చెలువుగులికె
ఈ కవికూన పేరఁకట మాడి క
న్నులలోన ప్రాణముల్ నిలుపుకొనియె
ఆ రాచకూన మార్గాయాసఖిన్న ఘర్మ
జములు వంగి పథిశ్రమములు వాఁపె
ఈ కవిబిడ్డ దుఃఖైకజన్మని తీక్ష్ణ
కిరణుండు శుచి నుడికించివైచె.

రాజు నిరంతభోగమధురం బగు జీవితమై గతించెడున్
రోజున తూర్యముల్ మరల మ్రోసెను శ్రీకలకంఠకంఠగీ
తీ జగతీఘులంఘులగతిప్రమదం బొలసెన్ మనోజ్ఞవ
ర్షా జయనాదనీరదభరంబయి మ్రోగె త్రయీనినాదముల్.

నాటిసంజవేళ నభమున ధగధగా
యితవిలాసదీప్తి జతనుపరచి
సానయిడిన మణివిధాన దీపిల్లు తా
రక యొకండు నేల రాలిపడియె.

కవికి క్షుధాగ్నిపీడితము కాయము త్రెళ్లెను కాష్ఠవహ్నిలో
శవ మిడునంతలో నపరసాగరమందున కర్మసాక్షి క్రుం
కువడె, నొకింతలోన మెఱుగుల్ దెసలందున క్రమ్మకొంచు నూ
త్న విలసనంబు చిమ్మ నొకతారక మింటికి నెక్కె వెంబడిన్.



## మహాల ప్రకృతి

ఏను ము న్నొక్కతటి నాలుగేండ్లక్రింద
నాంధ్రవీరులు చెఱసాల కభిముఖులయి
బార్లుతీర్చిననాడు శ్రీభారతీయ
మంత్రి శశిమౌళి 'పట్టాభి' మాటలాడ
జూడబోయితి.

నాపరిక్షుణ్ణసర్వ
విషయబుద్ధి సమస్తంబు విప్పిచెప్ప
అరటిపండొల్చిపెట్టిన ట్లాత్మ దోచి
యొకడు నాప్రక్కనే నిలుచుండి వినుచు
నన్నుగని-

"పెద్దలిట్లు ఘనాఘన ప్ర
కర్ష నేడేండ్లుగా బిట్టు 'ఖద్దరయ్య!
ఖద్దరు ధరించు' డని చెప్పగాను వినరు
మనజనంబు" లటం చుస్సురనియె నతడు.

నా కేమొ నవ్వువచ్చిన
దా కోమలహృదయుఁ జూచి
'యయ్యా! యిదియున్
నీ కాశ్చర్యమె! చూడుమి,
నాకో యచ్చెరువుసూచనయు లే దిచటన్.

'కృతయుగమునుండి మనపూర్వఋషులు తాము
ఎల్ల సంసృతి దుఃఖభూయిష్ఠ మనియు
మహిత మీ దృశ్యమానమ్ము మాయ యనియు
నూరిపోసిరి, యెవరు విన్నారు? చెప్పు.'

అని మఱల నిట్టు లంటి–
'నోయయ్య! మూల
ప్రకృతియైన యజ్ఞాన మా ప్రళయముందు
అందనుక దానిమీద లోకాళి నడచు
అందనుక దానిమీద రాజ్యాలు సాగు.'



## దేవుఁడు-మనుజుఁడు-కోతి

అర్థహీనమ్ము సర్వవేదాంతపరిష
దుగ్రవిజ్ఞానఘాతనిజోల్బణంబు
ఈ ప్రపంచమ్ము సృజియించి యేమొ లీల
యంచు మురిసెను భగవంతుఁ డన్నవాఁడు.

సర్వథా సర్వతో వినష్టమ్ము యయిన
యట్టి మాయను గతసృష్టి నధిగమించి
వ్యర్థమైనదానిని మఱీ వ్యర్థపఱచి
తనకు దా బొమ్మ విఱిచెను మనుజవరుడు.

ఈ వృథాసృష్టిసర్జన, నింతకన్న
చెడి వృథాయైన మనుజునిసృజన, వెక్కి
రింపువట్టి సజీవపు దృష్టిబొమ్మ
విధి నిరంతమ్ముగా గోతి వెక్కిరించు.

చ్యుతి

ఇది పరానురక్త మగుచు నాయెద జనించి
తావకాలయఘంటికాధ్యానపథము
లందు బడి యభ్రవీథులయంచు లెఱుగు
తలపు - వేగింపబడెద, నిత్యంబు నాథ !

నీగుడిప్రఘాణమును చేరనీక తరిమి
నారు భస్మధారు లగు పూజారివారు
నావదనసీమ బత్తి యన్నది కనంబ
డదట ! నావంటివారు కూడరట యిచట !

నీదుగుడివెన్కతట్టున నేల కొరిగి
పోవుచున్న ప్రాకారపుభూరియ దాగి
యాలయపుర:ప్రలంబిఘంటారవములు
వినుటపై మానసము నిల్పి వేచియుంటి.

ఆ నినాదంబులే గగనానిలములు
మోచుకొనిపోయెనో ! కాక నాచెవులకు
చెప్పరాని, వినరాని చేటు కలిగ
నో ! ప్రతీక్ష ప్రతీక్షగా నుండిపోయె.

ఆ నినాదాల కంకితమైన నాదు
పేదగుండె యా మ్రోతలు వినుట యనుచు
కలదొ ! ఏ నాటికైన నీ గండశిలల
యందు నే కూడ నొకశిల యగుటకాక !



అమృతకలశము

మనుజులెల్లరు గుమిగూడి చని మహేంద్రు
నగరి కింద్రునిసన్నిధానంబు జొచ్చి
దేవ ! యెన్నాళ్ళు నీరని త్రాగగలము
చావు లీ రీతి నెన్నాళ్ళు చావగలము.

ఆరనివాకలైన కరుణాంబుల జూడు మటన్న నా సునా
సీరుడు హాసముల్ మొగముచెంతల వింతలుగా ప్రసన్నగం
భీరములైనవాక్యముల మీ రమృతాంశునియొద్ద కేగి నా
పేరున నా మహాత్మునికి విన్నపముల్ బొనరింపు డం చనెన్.

జనములుగూడి శీతకరుసన్నిధికిం జని నీకరాల చ
ల్లనిదన మేమి చెప్పుదుము లాలితకైరవకామినుల్ వినూ
తనమధురత్రపాపులకితత్వము బొందునటే నినుం గనుం
గొన మముపంచె నింద్రుఁ డని కోర్కులు వానికి విన్నవించినన్.

కావిరివింతనవ్వు మొలకల్ బడి యర్ధనిమీలితంబులై
పోవఁగఁ గన్నుదోయి తనమోహనదేహమునుండి తీసి యిం
దీవరకన్యకాహృదయనిష్ఠితతాపము వాపగల్గు క్రొం
బూవుల రేకలం దమృతపుంగలశంబును నింపి యిచ్చుచున్.

అతని రెక్కలనీడ నమరిన కన్నెగే
దగిపూవజవరాలిసొగసు సొగసు
అతని మేలిపదమ్ము లాశ్రయించినతమ్మి
ననుచాయ నోచిననోము నోము
అతనిగానమృదుస్వనామృతమ్మును గ్రోలి
పొలుచు ముద్దుగులాబిపొలుపు పొలుపు
అతనినోటికి తేనె లందిచ్చు మందార
సుమము లే జవరాలికొమరు కొమరు.

తగినతావున ప్రేమమ్ము తగులజేసి
కలయిక పొసంగమిని మది కంది డస్సి
వాడిపోవుటకన్న నావంటి పూవు
పవనసంఘాతమై రాలిపడుట మేలు.

వెదురుబెజ్జములందు బిల్లగాలిపొనర్చు
గానమ్ము విని వానిగాన మనుచు
గాలికిగదలుజొక్కపుగులాబిచివుళ్ళ
మురువుజోకలు వానియొఱుక లనుచు
ఎండలోగాలికి నెగురుపండిన యాకు
నీడలు గని వాని నీడ లనుచు
తోరంపుమంచుబిందుల తాకు లుదయాన
సరముల నవ్వానిస్పర్శ లనుచు



ప్రాణములు లేచివచ్చినయట్లు విచ్చి
ఆస వెలితిపడంగ డా నంతలోన
తావి యూరుపునిగిడించు నీ విధమున
బ్రతిదినము వంతగుందుచు బాలిపోయె.

మధ్యాహ్నమార్తాండుమండుటెండల కోర్చి
తెలిలేతనెలవెన్నెలలకు గాగు
వడవాడ్పుమంటల బడి తెప్పరిలి లేచి
చలిపిల్లగాలికి సొలసిపోవు
పొగవోలె ధూళిగ్రమ్ముకొనంగ దలయొగ్గి
లలి బుప్పొడిదుమారములకు బెదరు
కణకణ మని నిప్పుకలవాన కాగి మం
చులకణమ్ములు సోక జలదరించు
గోరుతాకిన కందు నీ కోలవాడి
గాడిచేసెదు దానిపై కలత వెట్టి
దమిత సుకుమార మాప్రసూనమును మదన!
బళిర! నీ వేమి స్నిగ్ధభావములు గలవు.

పొన్నపూలవ్యాజమ్మున బొంత నున్న
పొన్నరెమ్మలపై నుండి క్రొన్నన చిరు
తేనియల జారు మధురగీతికలు మరల
నెన్నడేనియు వినిపించునే మొ నాకు.

అను తలంపున సంలగ్నమయ్యె మనసు
అంతకంతకు దనరేకులందు నొక్క
యసితభావమ్ము వ్యాపించె ముసురుకొనెడు
విరహతపనశోకమ్ముగా బరిణమించె.

తొలి వాడుచూపె, రేకుక
పళికలు మాసె, సితకాంతి పలుచబడియెఁ, దే
నెలవాక లెండెఁ దరిగిన
పొలుపున రాలిపడె దీగ మొదల గుదురునన్.

రొదబొనర్చుచు నెగురు వ్రాల దొకరెమ్మ
గనదు దనచెంత విరిసిన ననల రాలి
పడిన యా క్రొన్ననతొడిమివంక జూచు
చులుక తిరుగాడు సంజల నొక్క తేటి.



# రసప్రకృతి

తేటదేరిన కృష్ణానదీతరంగ
శీకరచయంబు గాలికి చిందిచిటిలి
ఇసుకతిప్పలపై మోసులెత్తియున్న
తెల్లదుబ్బులపై బడి జల్లులాడె.

కృష్ణవేణీతరంగనిర్నిద్రమధుర
గానలీలాస్వనమ్ముతో గలసి మెలసి
వచ్చు మలయమంజులసాంధ్యవాతములకు
ప్రకృతియంతయుఁ దన్మయత్వమ్ము నొందె.

మిగిలిపోయిరి కాలకర్మగతి జేసి
భావమున శాంతికుదురనివారు మాత్ర
మాంతరంగికమైన యశాంతి కెంత
సంతరించిన బహిరుపశాంతి లేదు.

పసిడిమవ్వపుటీరెండ మిసిమినిగ్గు
లల్లనల్లన శాద్వలశ్యామలమ్ము
లైన సికతాతలమ్ముల నాడ గాలి
నెఱి విసరు నొక్క మఱ్ఱిక్రీనీడలందు.

రోగపీడితుడై బాధచే గదలఁగ
బాలక స్వకాంతపజ్జ నిషణ్ణ యగుచు
దైన్యమొలికెడు చూపుల దన్ను గనగ
స్మృతినెఱుఁగకుండె నొకబీద చెన్నుతఱిగి.

మూసినకన్నెఱుంగకయె భూమిపయిన్ విషమజ్వరార్తుడై
గాసిలుచున్న ప్రాణపతిఁ గాంచి కనుంగవ నీరుచిమ్ములన్
మూసిన మూసికల్ గలుగుపుట్టమునన్ దడియొత్తుచుష్ణని
శ్వాసము కోమలాధరకిసాలయు మూరక బీటవారగన్.

కప్పుకాటుకకన్నులు కావిఁగొనఁగ
జారు బాష్పావరోధ మూ చాన శోక
మావరించినకతమున నా వదీత
రంగరవము విషాదభారమ్ము దాల్చె.

పతితలాడగనిడుకొన్న పాణితలము
మంటిగడ్డలలో బడి మట్టి వేరు
నొఱసికొనుచుండ గని వగనొంది మెల్ల
ముగుద పయ్యెద నుపధానముగ నొనర్చె.

ఆ సడి కా నిరుపేదయు
మూసినకనువిప్పి మఱల మూసిన బాష్పో
చ్ఛ్వాసపరంపర నిగుడన్
మూసినకను మరల విప్పి ముగుద మొగమ్మున్.



అరమోడ్పుంగనుదోయిగాంచ సతియాస్యంబందునన్ జాలి, శో
కరస, మ్మానసయు మ్మూడు లీనమగుచున్ గన్పట్ట నే మట్లుచూ
తు రటన్నన్ దలనొప్పి యేమివచియింతున్ గండ్రగొడ్డళ్ళచే
విఱుగన్ గొట్టినయట్లు నున్నయది తన్వీ! యంచు కన్మూసినన్.

బెదరె సతి యంతలోన గన్విప్పి చూచి
మఱల నాతడు తనచేయి తరుణిపైన
వైచి కన్నులనీర్వెట్టె వనిత వలద
టంచు శోక మాపుకొని ధైర్యమ్ము చెప్ప.

ఎట్లు ప్రాణాలపై నాస యెడలెగాని
కష్టపుంజావు తలనొప్పికారణమున
గలిగె నంచన, న ట్లనవల దటంచు
నెలత యేకధారగ కంటినీరు దొర్చె.

కలిసిపోయెను ప్రకృతి శోకరసమందు
ఒక్కదానిని నొకదానినుండి విడిగ
తీయుటకు వీలులేనట్లు తెలిసికొనగ
తెలియనట్టు లభేదమై చెలగునట్లు.

మరల కనుమూసి నిదురించు మగనిజూచి
యెవని నే వైద్యు బతిమాలి యేదియేని
మందు తెత్తునె యనుకొంచు మానసమున
నెంచి మఱి యంతలో సంశయించి మఱియు.

త్వరలోన వత్తు నంచున్
దిరమున్ జేసికొని యందు దేహమెఱుఁగకే
ధరణిపయి నున్న పురుషుని
పరమునకై నొప్పచెప్పి వలెఁ దాఁ జనియెన్.

దారింబోయెడివారి 'నయ్యా దయరాజా! యేటిగడ్డన్ వట
క్ష్మారుహచ్ఛాయల మీ గులామొకడు రోగగ్రస్తుడై యున్నవా
డీ రే యేగుట కష్ట మేదయినమం దీరే! ప్రసాదింపరే!
రారే!' యంచును నేడ్చి కాళ్ళబడినన్ రాడయ్యె నొక్కండునున్.

అందులో నొక్కరుండు మహానుభావు
డామె తన్నంటుకొనె నంచు నమితమైన
కోపమున నామె చెంపపై గొట్టె, దెబ్బ
తోడనే కంది నెత్తురుగూడుకొనగ.

ఆమె పాపము మఱలమాటాడలేదు
కనులగ్రమ్మెడు నీరమ్మైనను దుడుపక
దారి నేగె శాంతరసావతారమట్టు
లా ప్రశాంతమె ప్రళయమ్ము నాగె నేమొ!

తిరిగి చనుదెంచి పతి నిద్ర తెలియువరకు
నూరకుండు పటం చందు కూరుచుండి
కొంతసేపటి కతని మేల్కొలుపఁదలఁచి
పిలిచె, దట్టెను, కదిపెను, పిలిచె మరల.



పిలిచె నెన్నియు సార్లు వినువక మాటపై
మాట పాపము మరుమాట లేదు
కనుతెప్పలెత్తె, నాగని భయంబున గాని
కుటిలంబులై తెల్లగ్రుడ్లుపడియె
తనవ్రేలు ముక్కుచెంతను నిల్పె నసుమాన
ముగ నుంటకే స్గాలితగులలేదు
కరమున స్పృశియించెఁ గాలుసేతులు చల్ల
బడినట్లు కన్పించ వణకుబుట్టె
మఱల నారీతినే జూచె, మఱల జూచె,
మఱలజూచెను చివరకు దిరముపడియె
నయ్యో యని కేకవేసి యా యతివ నేల
విరిచికొనిపడె భూమి దిద్ది రని తిరిగ.

మసమసకసంజచీకటి ముసుగువెట్టి
కారుక్రమ్మెను రోదసీగహ్వరమ్ము
సంజప్రియుబాసి దురపిల్లు చక్రవాకి
యవనియంతయు జింతామయమ్ము చేసె.

## అస్రుత బాష్పము

'తల్లి! బిచ్చ మమ్మా' యంచు నిల్లునిల్లు
గడపగడపకు దిరిగ నొక్క నిరుపేద
చినిగి మాసిన పుట్టముల్ సిగ్గుచెరుప
కన్నుగవ మొగమ్మున దుమ్ము క్రమ్ముకొనగ.

పొమ్మనువారెకాని దయపుట్టి యొకించుక ముష్టివేయువా
రిమ్మగలేర యెవ్వ రిటు లేగి పురమ్మున నాల్గుప్రక్కలున్
గ్రుమ్మఱి యుస్సురస్సురనుకొంచు మఱిన్ మఱి వేడుచుండగా
రమ్మనిపిల్చి గుప్పెడొడిరాల్చి దయామయుమోర్తు పోయినన్.

దానికిదోడుగ నింకొక
మానవతీతిలక మచట మది జాలిమెయిన్
పోనిమ్మని యొకగుప్పెడుఁ
గానియు నొసగెన్ దయాంబుకణములు జారన్.

ఇంక నెవరైన బెట్టెదరేమొ యున్న
యాస నింకొకసారి యూరంత తిరిగి
తిరిగి వేసారు నామెదుస్థితిఁ గనంగ
జాలక యినుండు పడమటిసంద్ర మురికె.



తఱికయివేచు క్రూరునివిధంబున జీకటులెల్ల దట్టమై
తఱచయి క్రమ్మె నెల్లెడల దారినెఱుంగక యామె నల్గడల్
వెఱచుచు బోయిపోయి యొకబీదలుమూగెడునూడలెల్లక్రి
క్కిఱిసిన మఱ్ఱిచెట్టుదరికిన్ శ్రమచే గడు మందయానయై.

చనియచ్చోనిలుచుండి కన్నుగవ బాష్పంబుల్ దిగన్ జాఱ మా
సిన యా చింపిరిగుడ్డకొంగున ముఖస్వేదాంబువుల్ తుడ్చి యొ
య్యననాయాసముచేతనొక్కయెడదైన్యంబొప్పగూర్చుండి మె
ల్లన నల్దిక్కులు మోడ్పుకన్నుగవతో లక్షించె లక్షించినన్.

కడుపునిండుగ మేసి యొక్కయెడ పండి
యున్న యాబోతు నెమరువేయుటయు మఱ్ఱి
యూడల మిడుంగురుల్ మెఱయుటయు దక్క
వేరు కానుపించక యామె భీతిచెందె.

తిలనాసాహృదకించిదంకురితభీతిన్ ద్రొక్కిపట్టెన్ వెసన్
స్థలవిశ్వాసము పండియున్న వృషభస్వామిన్ జెలంగున్ సుహృ
ల్లలితంబై చెలువారు భావముపయిన్ ధైర్యమ్ము చెప్పన్ హృద
బ్జలతాంతమ్ము చలించి యాగిన జలేజమ్ముం బలెన్ బొల్చినన్.

చితుకులం దన్ని యిల ప్రోగుచేసి కొన్ని
మంటచేసి యాపై నొకమంటిపిడత
దెచ్చినయొకిన్ని బియ్య మత్తెసరు వెట్టి
చూచుచును గూరుచుండె నచ్చో లతాంగి.

చిఱుకులమంట చుట్టుగల చీకటు లించుక నొ త్తిగిల్లె ను
న్నతవటధారుణీరుహము నల్లడలన్ గనుపించె సాంద్రమై
యతివకు చిమ్మచీకటులు నందున భావనచేత దోచుచున్
ద్రుతగతిపోవుచున్ వికృతరూపము లెన్నియొ కానుపించినన్.

భయము నడంచికొంచు దలపన్ దలపన్ జివురాకుబోడి యే
దియొ స్మృతివచ్చినట్టులు మదిన్ దలపోయదొడంగె పాప మా
రయక వటావనీజవివరంబును వెల్వడి యూడవెంబడిన్
రయమున వచ్చు పాము నగు రాదు వివేకము చెడ్డవేళలన్.

పొంత కనుమోడ్చుచున్న యాబోతు చూచి
పామువచ్చుట కని యానవాలువట్టి
'బుస్సు' మని నిలంబడి లేచిపోయెఁ దొలఁగి
యడుగడుగువెంట మూపురమల్లలాడ.

ఒకసారి తనబిడ్డయును మగండు మఱూచి
వచ్చి పోవుట జ్ఞప్తివచ్చెనేమొ ?
కన దిక్కులేక యేకాకియై తిరిగెడు
తనదైన్యదశ మదిఁ దగిలెనేమొ ?
తుద కింత గూడైన దొరకని తన దుర
దృష్టమ్మునుగూర్చి యూహించునేమొ ?
చివరకు తనపాడుజీవమ్ము నిదియును
పో దేమనుచు దలపోయునేమొ ?



అంతకంతకు గుడగుడలాడి యుడుకు
పట్టుచుండిన గింజలవంక నుఱక
చూచుటయె కాని యా కాంత చూడలేదు
పాప మా దిక్కుమాలినపామురాక.

మెలికలుదిరుగుచు బిచ్చపు
వెలదుక వండుకొనునెడకు వెస నేమం చే
నల పాముచేతచెప్పుదు
గలగల మని వచ్చి యాపె కాటందుకొనెన్.

నిజముగా క్రూరమతులకు నీతిలేదు
ప్రశమితాంతరాత్ములకును రక్షలేదు
అట్టిఠావుల భగవంతుడైన లేడు
కాల మిటుమారె నీ కలికారణమున.

మొదల భుజంగమ్మును గని
బెదరి పయిన్ గఱచె నను వివేకము కలిమిన్
చెదరినగుండియఁ గెవ్వని
రొదచేసి ధరణిపయిన విఱుచుకొని పడియెన్.

ఒకమేనన్ స్రవియించుచెమ్మటలొ'అమ్మో'యంచుమైబాధ దో్ర
తక మేరీతిని పల్కుటోక్కొ! విగళద్ధమ్మిల్ల మాస్యమ్ము మీ
దికి రా బూడిదలోపలన్ బొరలుటో తీవ్రంబుగా నోట నూ
రక లాలాజల ముబ్బ నీ ర్కనులజాఱన్ దేలగా వైచుటో.

ఆ హారిణాక్షి బాధ నకటా యిక నేమని చెప్పువాడ, క్రూ
రాహివిషానలమ్ము మెయినంతయు బ్రాకి తుదన్ గతించె నా
దేహికి నట్లు వ్రాసె విధి, దీప మనన్ శశిరేఖ దూరుపున్
దేహళిదాటి కాలసతి తెచ్చెను మింటిగృహమ్ములోనికిన్.

పలపలని పలుచవెన్నెల
తెలికాంతులలోన మట్టితీరును మఱి యా
వెలదుకశవ మచ్చటి చిదు
కులబూదియు కాంచినంత గుండె చలించున్.

కోళ్ళఱచె దిక్కుగమి తెలతెల్లవోయె
లోకబంధుండు మొగి లను కోకచెఱగు
నడ్డముంబెట్టుకొనియె ముఖాబ్జమునకు
మంచుబిందులకన్నీరు నించె తరులు.

అచట భూతమ్ము త మ్మావహించు నటంచు
దూరదూరమ్ముగా దొలగువారు
కలరా తగులునంచు కాబోలు ముకుపుట
మ్ముల చేరుమాళ్ళచే మూయువారు
ఉత్తరీయపుగొంగు లోకకొంత మొగముల
కడ్డమ్ముగానుంచి యరుగువారు
'ఈ దారి వచ్చితి మేలరా' యని జామల్
ముడివైచి త్వరగాగ బోవువారు



గొడుగు లడ్డమ్ముగా బెట్టుకొనెడివారు
గాని యా దారిబోవు నొక్కరును వచ్చి
'యామె మృతి కేమి హేతువో' యని తలంచు
వారు ముక్కుపై వ్రేలుంచువారు లేరు.

మరుసటిదినమ్మునందు నంబురహబంధు
డ స్తమించెడువేళ పోగయిన కొంద
అచటియుద్యోగు లాలోచనాత్ము లగుచు
నేలలో యా శవమ్ము కోయించినారు.

# ప్రకృతిలాలిత్యము

బాలసూర్యునికిరణాతపములలోన
నుదురు చెమరుచు వర కాడి వదలి తోడి
బాలకుల, నింటి కరుదెంచె బసిదనంపు
చెయ్దములకాటపట్టైన చిన్నవాడు.

అరుగుదెంచుచునే వెన్నతరకతీయు
తల్లి కనకుండ నరిగి పాదములు గడిగి
వత్తునని పోయి దొడ్డిలోపలకు, గనియె
తొలుత గ్రొత్తగానాటిన తులసిమొక్క.

జపమొనర్చిన యజమాని జాలువార్చు
శుద్ధజలబిందువులను బీల్చుకొనుచుండె
జపసుమమ్ములరెమ్మల సంతరించి
కులుకుకొనుచున్న యా కన్నెతులసిమొక్క.

అల కుమారుడు నై జంపు జిలిపితనము
చేసెడు ప్రబోధముల కడ్డులేక
కులుకు దులసిని బెరికెడుగోర్కె జేసి
పిల్లయడుగులతో సమీపించె దాని.



ఎవరులేరుగదా యంచు నిట్టులట్టు
నరసి తనచేత నామొక్క నంటబోవు
సమయమున నంతలో గుండెజలదరించె
నుఱక నాతడు వెనుకకు దిరిగి చూచె.

'వలదురా! అన్న! వలదు, నీవంటిప్రాణ
మేకదా యది, విన జీవహింసకూడ'
దని వచించె మందమందానిలమున
కదలుచుండిన మల్లెమొక్కయొక డచట.

ఆ పలుకు నాటుకొనియె హృదంతరమున
బాలునకు దానితో నేమి పలుకలేక
చేయుటకు నేదియేనియు జేయిరాక
నిలువబడి తులసిని నిదానించి చూచె.

'ఏల నను జంపెదవు, నీకు నేను నేమి
చేసితిని? చెప్పు' మని దయాసింధువైన
యతని బ్రార్థించె చిన్నిప్రాయంపుతులసి
తన చిఱుత పత్రములయందు దైన్యమొలుక.

కుఱ్ఱవా డేలకో చల్దికుడువరాడ
యింతవరకును ననుకొంచు నేగుదెంచి
'తులువ పీలికితివాయేమి తులసిమొక్క'
ననిన జననికి నగు చిట్టులనియె నతడు.

'అటుల గాదమ్మ, అదిగాదు చిటిసాబంగు
తులసి చెలియలిముద్దాడుదును బెరుగును
బువ్వ తులసికిఁగూడ నింపుగను బెట్ట
వా?' యనుచు తులసిని ముద్దులాడె మరల.

అనవుడు బట్టరాక హృదయంబున నూరక పొంగు ప్రేమచే
దనయుని జంక కెత్తుకొని తన్మధురాధరగండపాళికల్
చనవున ముద్దువెట్టుకొని 'చక్కనినాయనగా!' యటంచు కై
కొనిచనె తండ్రియొద్ద కొనగూర్పఁగ నాతనికిన్ బ్రమోదముఁ



## లేటిపిల్ల

భూతంబుల్ బెగడొంద రాజ్యమునుదాబూనెన్ 'న దాతవ్యం,మ
స్నాతవ్యం, ధరణీసురా నను నయష్టవ్యం, నహోతవ్య' మం
చేతాదృగ్బహుదుష్టకర్ముఁ డయి శాసింపించె వేనుండు, నో
హో!తా నేనట భూతనాఁధుడు!జగమ్మోగించెబో చేతిలోన్.

ఆతఁడు క్రూరుఁ డొక్కమృగయాంరతిపోవుచు సత్త్వవర్తకుం
డై తగుమంత్రినిం బిలచి యాతనితోఁ జని కాననస్థలీ
భూతభయంకరమ్ముగ ప్రభూతమృగాధిపముఖ్యజంతు ని
ర్ఘాతముగా జరించె ప్రవికంపితపార్శ్వమహాతరూర్విగాన్.

ఒకసారంగి విలోచనోద్గతభయవ్యష్టాత్మ సద్యః ప్రసూ
తకృపాహీనుఁని వేను క్రూరశరపాతంబై గతించెఁ దయా
ప్రకృతిఁ ప్రెగ్గడ దానిచిన్నశిశువుఁ రక్షింపగా నాజ్ఞ పొం
ది కృతార్థుండునుబోలె పట్టణము కేతెంచెఁ సశాబంబుగాన్.

మరచి క్రమముగ తల్లి నా హరిణశాబ
మెదుగుచుండ సంతోషించి రెంతయేని
దాని జూచి యమాత్యుండు తండ్రివోలె
వాయుభట్టారకుఁడు దాను భర్తవోలె.

ఆ హరిణంబు నంకురితయౌవనమై కమనీయశాద్వల
శ్రీ హసియించుచోటల చరించుచునుండ నొకప్డు మంత్రి తా
నా హరిణంబు జూచుటకునై చని ముద్దుకు తాకబోవగా
సాహసవాంఛ దానడిగెవచ్చి యొసంగు మటంచువాయువున్

ఇది తఱికాదటంచు ఘణియించెను ప్రెగ్గడ పెంచుకూరిమిన్
వదలగ లేక లేక జన వాయువు నాతనివంక మొగ్గుచూ
పె దృగంచితప్రభల్ చని విభీతవిలోచన లేటికన్నె వా
రిదములు మూగి శ్రావణము రేగెను వీచెను శీతవాతముల్.

ఆ వర్షాసమయాంతశర్వరుల శ్యామాంభోదమాలావృతం
బై విస్ఫీథి ప్రశీతవాయువుల పెల్లై ధాత్రి తచ్ఛీతబా
ధావైవశ్యముచేత లేడి కలకండన్ జూచి యమ్మంత్రి ప్రే
మావిర్భూతమనస్కుడై హరిణికొయ్యన్గూర్చె తోల్పుట్టముల్

వైయాఘ్రాసనమందునిద్రయొడలన్ వైయాఘ్రకూర్పాసమున్
వైయర్థ్యంబుపొనర్చె లేటి భయమున్ స్వార్థాధికజ్ఞానమున్
వాయవ్యాశలు నంతకంత తరుగై వర్షాసమారంభవే
ళాయత్నంబులు తగ్గజొచ్చినవి వాలాయంబు సాహాయమై.

మరల నొకనాడు మంత్రి యీ హరిణికడకు
పోయి దానిని ముద్దుకై ముట్టుకొనియె
మరల వాయువు జనుదెంచి తరిగిపోయి
నట్టియుత్సాహమున నిమ్మటంచు నడిగె.



వదలగ లేదు మంత్రియు, వాయువు కోరికసేయు పైన, కొ
న్నిదినము లిట్లుపోయె, నవనీపతి వేనుడు వచ్చి యొక్క నా
డదలకయున్న లేడి గని యాత్మ ముదంపడి తాను పెంచగా
మదిజనియించి కొంచుజనె మక్కువమీరగ లేడికన్నియన్.

రాజగృహముఖకక్ష్యాంతరప్రఘాణ
బద్ధమగు జాగిలము పారబాటువలన
మెడగొలుసు దుస్సిపోయి, కన్పడినతోన
హరిణిపైబడి పిక్కను కొఱికివైచె.

మంచి లగుడంబులను విడి
పించిరి జాగిలము భటులు భీషణతరనే
త్రాంచలముల దా నాజ్ఞా
పించెను నా కుక్కచావు వేనుడు వెంటన్.

ఆయన లేడికి వైద్యము
జేయించెను, దాని నయముచేయగలేమిన్
త్రోయించెను కారలలో
లోయలలో క్రూరవహ్నిలో వారి వెసన్.

మించినసీతుకారున శమించక గాయము దాని బిట్టువే
ధించెను మానుపట్టక యతిక్రమితాబ్దముగా శమించెబో
కుంచుకొనంగబోదిపుడు కోమలదేహము ముట్టవచ్చినన్
మించువిధాన పాఱదు సమీపము జేరినవైన లేడియున్

ఒకదినమం దమాత్యుఁడును నుర్వీపతిన్ గనవచ్చి లేడి శా
బకమును జూచి, సంచలనభావముదక్కినదాని నేత్రముల్
క్రకచములయ్యె దొంటిమమకారముబోవక దానిబిల్వ, లే
వక యది స్తబ్ధమై యొకటపండుకొనెన్ గురుతైనలేకయే.

వాయుభట్టారకుండు నా పంచలందు
తిరుగుచుండియు నిమ్మించు హరిణి నడుగ
లేదు, మంత్రి యాత డడుగలే దని హృది
నెంచెగాని, తా నది కదిలించలేదు.



## మంటిపాము

ఆదికాలాలనాడు విహాయసమున
ఉజ్జ్వలసరాగమధురతరోదయములు
శ్యామశోణసాయంతమస్సంధ్యలందు
పాడును ప్రశాంతగీతముల్ పక్షివితతి.

అప్పటికి ధాత్రి లేదు, విహాయసమున
నే జనించిన పక్షు లందే వసించు
యుగము లిట్లయ్యె, నొక్కనా డుదధిలోన
కళపెళని కాగి సుడివోయి కలతపుట్టె.

ఆ మహావర్తముననుండి యవని వెలికి
వచ్చె, క్రమముగ నా నేలపైన చెట్లు
మొలచినవి, పెద్దవై ద్విజావళులు వాని
కొనల గూళ్ళను నిర్మించుకొనియె పోయి.

అవి నిశాభాగమెల్ల వృక్షాగ్రములను
మీలితాక్షములై విశ్రమించియుండి
ప్రాతరుదయదంభోజమిత్రకిరణముల
లోన మాధుర్యరాగము లున్నతులు ముట్టు.

తపనుని సరాగరోచిరాతపములందు
ముగ్ధవారాశిదివ్యసంతోషలహరి
మధురలజ్జారుణకపోలమందహాస
ముగ్ధనవమోహనాకారమును వహించు.

గడచినదినాలతోఁగూడ పుడమి మన్ను
నల్లపడిపోయె నొకగాలి పెల్లుపీచి
సుళ్ళుతిరిగిన నొకదందసూకమూర్తి
యిట్టె రూపమ్ముదాల్చె దుమ్మింత లేచి.

అది మొదలు క్రూరసర్పవిషాగ్నిహోత్ర
మఖిలదిశలందు నుగ్రమై యవతరించె
పాల్కడలి తద్విషాగ్నిసంభరిత మయ్యె
ఉరక పవనమ్ము వెచ్చనై యూదదొడఁగె.

అరుణుని దినదినాస్తసమయములయందు
పశ్చిమాశాముఖంబులై పక్షితతులు
పూర్వకాలశ్రుతులు మాసిపోయి గగన
పథమున విషాదగీతముల్ బహిరవెట్టు.



## ప్రకృతి రహస్యము - కళాపరిణామము

ఒలయు శిశిరవసంతసంయోగమునను
సాంధ్యరాగప్రభావిలాసముల కర్థ
గోచరముకామి నొకకవి కూరుచుండె
లలితకృష్ణాపగాముక్తపులినతలుల.

కెలన నమృతపుఁజినుకులు చిలికి చిన్ని
కన్నెతరగలు నటియింపఁ జెన్ను కురియు
పిల్లగాలుల శ్రుతి మేళవించి పాడె
మృదువగు ప్రశాంతగీతిక కృష్ణవేణి.

దూరమున లంకలో మావిభూరుహంబు
చివురుటాకుల గమిచి మేసిన పికంబు
తాళజాలక గొంతుకోతకును మొరసె
మొరసినంతలోఁ దేనియ ముసురుపట్టె.

చివరపలుచనిహార సంజ చివురుచాయ
లలమి యలరారె నొక మేఘ మబ్జబంధు
డద్దిన మెఱుంగు పవడంపు టంచు మెఱయుఁ
బశ్చిమాశాంగనాకుచాంబరమువోలె.

విమలజపాసుమంబు నడివేసగి వాడువిధంబునం గ్రమ
క్రమముగ సంజకెంజివురురక్తిమ నేలతొఱంగిపోయి ప
శ్చిమదిశయందు బేరుకొని క్షీణదశం గనుచుండె నంత సం
తమసము మెల్లమెల్ల గగనంబునఁ దారలతోనఁ దార్కొనెన్.

ఇరులాశావలిఁ గ్రమ్మినన్ గదల కందే కృష్ణవేణీతరం
గరవంబుల్ వినుచుం దదీయజలముంగన్గొంచు భావోదయ
స్ఫురణం జొక్కుచునున్నవాని కనుచూపున్ మేర బంగారపున్
మెరుపుల్ దోచె నదీతరంగములపై నృత్యంబు గావించుచున్.

తొలిదెస గనినంతనె, తెలి
కలువకుఁ జెక్కిళ్ళ మకరికల్ వ్రాయఁ గరం
బులఁ బునుగుఁ దెచ్చినట్టుల
వెలిగెన్ జాబిల్లి యరుణబింబముతోడన్.

సజ్జనునికోప మంతలో సన్నగిల్లి
విమలశాంతరసాపూర్తి వెలయునట్లు
చంద్రబింబము రక్తిమ జారిపోవ
నైజ సౌకుమార్యపుఁ బ్రసన్నత వహించె.

మున్ను చంద్రునిపై వ్రాసికొన్న పద్య
మొకడు స్ఫురణకు వచ్చి చంద్రోదయమ్ము
తనర వర్ణించెఁ జివురుమెత్తందనమ్ము
సరకుసేయని చిఱుతేనెజడులనుడుల.



'రేవెలుంగుపులుంగు చేవదేరెడునట్లు
పూపవెన్నెలనిగ్గు పోసి పెంచి
కఱకుటెండలఁ గంది గాజువారిన కల్వ
జవరాలి చలువవస్తువులఁ దేర్చి
తేటతేరిన మంచునీటితుంపురుల లే
పైరుపచ్చలఁ గొనల్ వారఁజేసి
వడగట్టినట్లు కన్పడు సన్నరేయెండ
తఱగల నెలతాలు కఱగబోసి
గందపుంగొండ చల్లలేగాడ్పుతోడ
నవ్వులాడుచు జేజేల బువ్వమింట'
అని చదువునంతలోన 'సీ' యను విరక్తి
తోచె నాకవిరాజుహృత్తోయజమున.

తనరారు చంద్రుఁ డద్దపుబిళ్ళవోలె
ననుకొని తన్నేఁ దా హసియించుకొనియె.

మది కేదో యొకరీతి భారమయి సామాన్యంబుగా దోచు నె
య్యది, వెంటన్ భగవద్విలాసభరితంబై కాంతిరాజిల్లు న
య్యది,నూత్నామలభావదీప్తహృదయుండై చంద్రబింబమ్ములోఁ
జదివెన్ సర్వజగన్నియంతృకరుణాశాంతిప్రసాదంబులన్.

## నా ప్రవృత్తి

ఒక మనోహరమైన యూహ హఠాత్తుగా
చింతనొందు మనస్సు చివర తగిలి
ఒక మంచుబిందువోలిక చల్లనైన భా
వం బంతరాత్మలోపలను దోచి
కనిపించుచున్న వస్తునికాయమున నొక్క
సుందరాకృతి మనస్సునను జొచ్చి
ఒక్కొక్కమాట యెందో వినంబడి గూఢ
మొక యర్థ మది యెంతయో ధ్వనించి
కూరుచీకటివోలె నెడారివోలె
నైన నాజీవితంబునయందు నొక్క
మెఱపుమెఱపించి కొన్నినిమేషములుగ
నమృతఖండంబు చేయు నాయాత్మసీమ.

కడమ నాజీవితంపుచీకటులత్రోవ
నామెఱుగు వెల్గుపొరలు తారాడి యెప్పు
డపుడె ధర రాలిపడు నన్న ప్రాణకుసుమ
ములకు నులిపచ్చగల తొడిమలను గూర్చు.



## ఒక యనుభూతి

వచ్చి ఝంఝామారుత్తులవలె మదీయ
హృదయగోళమ్ములో కదలించివైచు
రేగి ప్రళయాగ్నికీలలరీతి నాదు
తరుణహృదయమ్ములోపల తగులపెట్టు.

కామమును క్రోధమును ధూర్తగతులు చూపి—
అవి యథేష్టమ్ముగా నాహృదంతరమున
సంచరించి యే వేళకో సంత్యజించి
పోవు,

నొక పెనుభూతము పూని వదలి
పోయినప్పటి మానిసివోలె, పరశు
రామసంప్రీతిమైన కుగ్రామమువలె,
హృదయరక్తమ్ము నాళాంతరితజవమ్ము
తోడ పీల్చు విషజ్వరోద్ధురత తగ్గి
పోవునప్పుడువలె,

క్రుంగిపోవుచుండు
నాదుప్రాణాలు వచ్చి యానాడు దినము
దినము నాపైన కొన్నాళ్ళు-

## ఓ చెలీ!

ఓ చెలీ! నీస్వభావమం దొక్కొకపుడు
గాఢఝంఝామారు త్తరంగములు కలవు
నీయెద చలించు మలయాద్రినిభృతవాయు
శీకరార్ద్రమ్ము వాని నోర్చెదను నేను.

ఓ చెలీ! నీస్వభావమం దొక్కొకపుడు
ఘనతరాంభశ్చలావ ర్తకములు కలవు
నీయెడద నూగు చిన్నారి నీటికాల్వ
చిఱుతరగ లెంచి వాని నోర్చెదను నేను.

ఓ చెలీ! నీస్వభావమం దొక్కొకపుడు
ప్రళయమార్తాండతీక్ష్ణాతపములు కలవు
నీయెడంద లేమావులనీడలోలయు
శీతలత్వార్ద్రి వాని నోర్చెదను నేను.

ఓ చెలీ! నీస్వభావమం దొక్కొకపుడు
నాల్కతడియార్చు క్షారవార్నదులు కలవు
నీయెడఁద నాన్యతోదర్శనీయమాధు
సింధువుల నెంచి వాని నోర్చెదను నేను.



## అంభోధి

ఈ పయోరాశియడుగున నెన్ని యెన్ని
మణులు గోమేధికమ్ములు మరకతములు
ఈ జల మ్మెండిపోవున ప్డేగుదెంచి
అవి విలోకించి యానంద మనుభవింతు.

ఒకయుగ మ్మయ్యె, నే నప్పటికి పయోధి
దరికి జని విలోకింతు, నుత్తాలవా స్త
రంగచుంబితగగనమార్గ మ్మదియును
ఆగవలె నని యెంచి యే నరిగినాఁడ.

గడువనిచ్చితి రెండుయుగమ్ము లంత
పోయి చూచితి నప్పు డంభోధి యదియు
క్రూరఝంఝామరుద్ధూతవారిధార
మై దిగంతమ్ములందున మాఱుమ్రోగు.

కాదని యికెన్నియుగములో గడువనిచ్చి
రమణపోయితి నబ్ధితీరంబువరకు
దుర్భరతరంగశిఖరవిధూతనౌక
మది యథాప్రకారముగఁ దారాధ్వమంటు.

## భావకవి

ఈ హరిదంతభూములను నేమి పనో తిరగాడుచుంటి నా
యూహలుగూడ మందపవనోర్మిలతో, విచరద్విహంగసం
దోహముతో, మొగిళ్లగమితో మెలమెల్లన ప్రాకులాడు నా
శాహతి ఱెక్కలార్చు గగనాగ్రతలంబున కంటబోయెడున్.

నాయెద మందమందగమనంబుల చూపెడు నొక్కమాఱు, మా
లాయితమల్లికాసురభిళత్వము చూపెడు నొక్కమాఱు, క
న్దోయితుకన్ ప్రశీతలమనోధృతిచూపెడు నొక్కమాఱు నా
మై యిది యేమొ గాలిపొరమాదిరిగా నవునట్లు తోచెడున్.

ఈ గగనంపుబెల్లల చరించెడు బాలవిహంగకోటి కం
టే, గిలుబొప్పుకాంతులు గణించెడు లేతమొగిళ్లచాలు కం
టే, గొనయంబు లాగి బిగియించినవింట విదల్చినట్లు నా
శాగతి పోయెడున్ బరవసంబున నాయెదలోని భావముల్.

కొండలనడుమ భగ్గున సుళ్లుతిరుగు చా
కసముముట్టెడు కొండగాలి నౌదు
కొండలంచులరాళ్లు ఘూర్ణిలంబడిపోయి
పడబోసికొను సెలవాగు నౌదు
వేనికి గనుపించరాని యే కొండగుం
పులనో యొకడవిలో పూవు నౌదు
పెనుగాలి విడుగ ద్రోసినగుమ్మల వెదుళ్లు
లోయలలో వింతచాయ నౌదు.



## ముక్తి

నేను :

ఓయి నటకుఁడ! ముక్తి కెట్లూహసేతు
వేది యాలంబనముగ గ్రహించినావు?

నటకుఁడు :

నావదనరేఖలందున నాట్యమాడు
నీ ప్రపంచము, దాని గ్రహించినాను.

నేను :

ఓయి చిత్రకారుఁడ! నీదు నూహ లేమి?
ఏది యాలంబనముగ గ్రహించినావు?

చిత్రకారుఁడు :

నాకరాగ్రపుకుంచెలోన జనియించె
నే రసాకృతి యామె గ్రహించినాను.

నేను :

ఓయి గాయక! నీ వెట్టు లూహసేతు?
ఏది యాలంబనముగ గ్రహింతు వీవు?

గాయకుడు :

మధురభారతి నాకంఠమధ్యమందు
నైక్యమందునయేని నా కదియ ముక్తి.

నేను :

నిన్ను సైతమ్ము మఱల బ్రశ్నించుచుంటి
నో కవీ! ముక్తిగూర్చి నీయూహ లేమి?

కవి :

నిశ్చలంబుగ నన్నుండనీవయేని
పరమయోగిని నన్నేల పలుకరింతు?

## సీతాకోకచిలుక

ఎరుపు పసు పారుపచ్చన యింద్రనీల
మణిశకలకాంతి నెమలి జిమ్మనుచు విప్పి
కొన్న పించెమ్ము లెగబోసికొన్న రంగు
రంగుల హారంగు, పట్టుచీరల మెఱుంగు
టంచుల బెడంగు, భిల్లకన్యావిలోచ
నాంచలచకచ్చకచ్ఛవి, యంబుదముల
దళసరి మెఱుంగులోన పచ్చల వెలుంగు
లొలుకబోసిన మెఱపుకన్నెల విదుల్పు.

*　　*　　*

ఈ సముద్రమ్ము ఘోషించు నేల ? తరగ
తరగ కదలాడి యొడ్డున విరిగి విరిగి
తెచ్చిన వినీలకాంతులు తేలిపోయి
తగిలి యొడ్డున తెల్లని మొగము వేసి.
నురుసులై కృష్ణసర్పముల్ నూర్లు వేలు
లక్షలును కోట్లు నింద్రనీలమణిశిఖర
దీధితి వెలార్చుకొను శిర స్త్రీవ్రతావి
చాలనోద్ధతములు నిట్లు జారు నేల ?
ఒడ్డున విఘాతమై మరియును మరీను
తెల్లనై తెల్ల నగుచు కంపిల్లు, పొట్లు



విడని గోధుమగింజల వింతదోర
రంగులోలయుచు నిండి జాఱుంగురైన
అలిచిప్పలు వత్తులు వందములకు
వందములు దిద్దు లేదన్న ప్రాణ
ములును మును కదలాడిన జలధిలోని
చిత్రజంతుసంతానమ్ము చేసికొన్న
గుల్లలగు నిండ్లు సూర్యుని తెల్లకాంతి
తగిలి భగ్గునమండి సంధ్యావినూత్న
మంజులచ్ఛవిసంస్పర్శ మండి మండి
ఉరక నీ గాలిత్రోవల నురుకు పెట్టు.

*　　*

ఆకసము క్రొత్తకాంతుల నవఘళించి
కనపడని యింద్రదేవుని కాంతి విరిసె
రంగుల మొగిళ్ళు కాంతులరాశి బోసి
వెనుకనోదిగిన యస్తమించిన జలేజ
బంధుకాంతికి నొకచోట పద్మరాగ
శకలరమ్యమ్ములై, యొక్కచాయ పుష్య
రాగకాంతిచ్ఛటాసమారబ్ధనూత్న
మోహనావతారమ్ములై ముందుముందు
అంచులజరీ మెఱుంగు లద్దికొనుచు
మరల నొకచోట మృదునీలిమన్ దగద్ధ

గిత కనత్కాంతి బిట్టు నూగించుకొనుచు
కొంత సంతోషపడినట్లు కొంత దుఃఖ
పడినయట్టులు మరికొంత భావమెల్ల
భర్తపై నిల్పుకొన్నట్టి భామయట్లు,
అచట వాసకసజ్జిక యట్లు, నచట
వచ్చి యభిసారికంబలె పగిలిపోవ
నేటికో పశ్చిమాశ తా నీ విధాన
ఆవెనుక నస్తమించుచున్నట్టి సామి
భాను డల పశ్చిమాశ చేపట్టు జారి
పోవుచు దురాశ కాక తా పూర్వదిక్కు
కొఱకు కరములు వెన్కగా క్రమ్మజొచ్చె
పూర్వదిశయు నేదో లేనిపోని యొక్క
రాగవల్లికచే తాను నూగులాడె.

* * *

ఇది పొడలపాముకాబోలు, నీశరీర
మెల్ల బహువర్ణసాంకర్య మేచి శిరసు
మాత్ర మొక క్రొత్తరంగున మారిపోయి
మలకలుగ దీనినడచినమార్గమెల్ల
ఉన్నరంగులుగాక మరొక్క క్రొత్త
రంగు కల్పించుచుండి, ఔరా! మరేమొ
వేగమునజేసి యొకరంగు విస్తరించి



పలుచబడుచుండె, ఆ పల్చబడిన రంగు
మరియు నొకరంగువోలె సంపత్తిదెచ్చె
ఇంతపరువెత్తు త్రాచున కేమొ వెక్కి
రింతవెట్టినయట్టుల వృక్షపటలి
చివరలచివుళ్ళు రంగు లార్చికొనుచుండె
కోమలకుహూనినాదసంధ్యామనోజ్ఞ
కంఠ కన్నులలో నెఱ్ఱకాంతిదెచ్చి
మేనినల్లనికాంతులు మ్రింగివేసె
ప్రొద్దుగ్రుంకెడు చీకట్లు పొదలనడుమ
దూరి యడవులదారుల తారులాడి
నల్లనై యందులో కొంత తెల్లవడియె
ఇంతచీకటిలోకూడ వృక్షశాఖ
లందు నడుమన నడుమన నల్లలాడి
పుణుకుపుణుకున మిణుగురుపురువు లొప్పె
చెట్లకొమ్మల మాధవస్థితిని దెల్పి
కోకిలవిచిత్ర మగు కీవి క్రమ్మరింప
నింద్రగోపమ్ములు ధరిత్రి కెత్తినట్టి
యెఱ్ఱదీపమ్ములై సొగసెల్ల నొలికె
రంగులు ధ్వనులును విడంబరచగరాని
శ్రవణనేత్రేంద్రియముల నేర్పరచరాని
ఒకసమైక్యము స్ఫురియించుచుండె నడవి.

* * *

ఒగి ప్రియాగతవేళా మహోత్సవమ్ము
చేసుకొనుచుండిరేమొ యీ చిన్నిపడుచు
లొక్క విధముగ లేని యీ యొప్పులొలుకు
చీరలు ధరించి దశదిశా శ్రీలు తామె
మూర్తికట్టించుకొన్నట్లు మూర్తులైరి
యౌవనోదయవేళా సమాప్తమైన
యీ హఠాన్మాధురీలజ్జ లెచటనుండి
తెచ్చిరో, పూర్వజన్మ లందిచ్చుకొనిరి
సరిగ నీ సమయానికి సాగి వీరి
కన్నులను పొల్చినవి నెమ్మికన్ను లొలసి
వారుకట్టిన రంగురంగారుచీర
లంచుల తదీయభర్తల యాత్మలందు
వెలయు మధురభావమ్ములు విసరులాడె
ఓహోహో! యీ ప్రయాణమ్ము లెటకో, వీరు
ఇక మధురసంధ్యల బ్రదుకనీర యేమి?
గంతులను వేయు పిల్లమేఘాలయాట
లింతయును లోకమున జెల్లనీర యేమి?
దొరలిపోయిన జీవమాధుర్యరేఖ
లెల్ల వీ రాచుకొనెదరా యేమి యేమి?
సర్వకాంతులలో నున్న సారమెల్ల



వీరె మరి యాదురా యేమి? విశ్వమెల్ల
ఈ మహాకాంతిలోకాని యిముడ దేమి?

* * *

పవలుపవలెల్ల మృదుమందపవనవీధి
చిక్కవడిన సీతాకోకచిలుక మరల
మరల తనకాంతి చీకటుల్ మలగియాడు
కోనలందున మరచి పోగొట్టుకొనియె
కాని తారకాకాంతులు క్రమ్ముదెంచె
పూర్ణిమాచంద్రరోచులు పొంగిపోయె.

## సంవత్సరాది

'నిన్ను గొనిపోవ వచ్చినాడుగద! నీదు
నన్నగారు పుట్టింటికి పోయెదే!' య
టంచు ప్రశ్నించె ప్రియుడు జ్యోత్స్నాప్రపూర్ణ
శర్వరీవేళ వయసుటిల్లాలి జూచి;
రేపొ యెల్లుండొ చైత్రమాసమ్ము వచ్చు
అదె వసంతుడు పరిమళించెడిని నూత్న
మల్లికాలతాసతుల యౌవనములందు
భాగ్యమును ప్రాయమును గల్గు దంపతులకు
రమ్యసౌధాగ్రభాగములందు పఱచి
నట్టి తెల్లనిసెజ్జ శరణ్యమయ్యె.

పతియొనర్చిన ప్రశ్న కే మనుచు బదులు
చెప్పుదునొ యంచు యోజనసలుపుటో కొ
గాని యా ముద్దరాలు వంచిన మొగమ్ము
చిన్నెలందు తద్భావమ్ము స్పష్టపడియె.

కొంతసేపటి కా స్నిగ్ధహృదయ మొగము
నెత్తి యేదియో వచియింపబోవులోన
సాంద్రశీతలరేఖాప్రభావ చుంచు
కిరణజాలమ్ములన్ ముంచిలేవనెత్తి



నాయమమొగమ్ము శశి యనౌచిత్యఫణితి
'మీరుమాత్రము రారా?' యన్నది లతాంగి.
కోమలాననాంభోజరేఖాప్రసుప్త
ప్రణయశైవలినీవాకణమ్ము తొలుక
'నీవు వెళ్ళుట నిజమైనదా?' యటంచు
చిరునగవుతోడ ప్రియుడు చమత్కరించె.

చారుచంపకసౌభాగ్యదేహవల్లి
యైన యా ముద్దుటిల్లాలు చనవుచేత
వచ్చి యశ్వత్థమును ప్రియంగులతవోలె
పతిని కౌగింటబూని 'నిక్కముగ నన్ను
నంపరా?' యని మోముపై మోము జేర్చి
అడిగి తా నేమి పతి చెప్పునో యటంచు
కుసుమకోదండకాండకోరకములైన
చూపు లాతనినెమ్మొగమ్ముపయి బఱపె.
అతిప్రసన్నమయ్యును కఠినమ్ము నగుచు
కానిపించిన దతనియానన మదేమొ!

ఆ ముఖవికాస మలవాటుపడిన కాంత
తనశిరీషకుసుమమార్దవమ్ములైన
చేతు లాతనిగళసీమనుండి తీసి
యూరక యధోముఖమ్ముగ నిలచియుండి
బాష్పకలుషితమును జేసికొనియె మోము.

ఇది యెఱుంగడు పతియు ప్రేమాపగాత
రంగ మింకొక్క డతనిపై వచ్చినంత
ప్రణయశీతలమైన కాంతాకపోల
మదుముకొనియె స్వీయకపోలఫలకమునకు.

తనకపోలమ్ము తడియైనవిధము తెలిసి
తెలిసికొనినాడు తనదు ప్రేయసిమనమ్ము
స్వప్రియాకోమలాననాంభోజ మంత
తనకరమ్మున గడ్డమ్ముపూని యెత్తి
సొగసునవ్వుల చిలికించి హాయసుకాడు
'ప్రేసి! పండితురాల! ఇ దేమి?' యనియె.
ప్రేమమాధురీవాహినీ ప్రాణపదవి
మందహాసమ్ము భార్యముఖాన దోచె;
పూవుబాణపురోద గాలి తోడ వీచె.



## అ యి ము ర ళి

'అయి మురళి! ముకుందస్మేరవక్త్రారవింద
శ్వసనమధురసక్తే! త్వాం ప్రణమ్యాద్య యాచే
అధరమణిసమీపం ప్రాప్తవత్యాం భవత్యాం
కథయ రహసి కర్ణే మద్దశాం నందసూనోః'

అని ప్రవాహిల్లినట్టి కర్ణామృతమ్ము
ఒక్కమలయానిలము వీచు నొఱపుసంజ
వేళ వాఙ్మనోమృతము గావించుకొనుచు
కూనరాగాలయలలలో గొంతు నార్చు
కొనుచు నుంటి—

వెస వసంతుఁడు నా రాజ వేసగాఁడు
తెరవెనుకనుండి వచ్చుట తెలుపుచున్న
చోపుదారు కోకిలకుహూశ్రుతులలోన
'అయి మురళి' యన్న గీతమే యాలపించె.

గంధ మక్షతగింజలు కలిపి నొసట
మెడను గంధమ్ము మొగమున మినుకుమినుకు
మన్న యెఱ్ఱని చిన్నిబొట్టంద మొలుక
మూగనోముపట్టిన బాలముత్తయిదువ

లట్లు నా నాల్గు కెలకులయందున నవ
నవవికాసమ్ము నేచుకొన్న పువుకన్నె
లిచట మల్లికచివురాకు లెత్తుకొన్న
శ్వేతదళములో మిసమిసల్ నించుచుండి—

ఇది గులాబి గుండ్రని లేత మొగ్గ పెదవి
జంట యచ్చెరువొందిన సమయమందు
బోలె తన రేకుగమి చిన్ని ప్రోవు పెట్టి—

ఇచట నందివర్ధని కండ్లకెత్తినట్టి
పచ్చకప్పురపారతిపగిది పొలిచి—

ఇందు పచ్చగన్నేరుగాలి కెగురుచుండి
కదలులాడిన బంగరుగంటవోలె
కడలనాల్గింట బూపరాగమ్ము నొలికి—

ఇచట మందార తన మహామొగ్గనైన
సొగసులో నల్లతుమ్మెదమగని నడుము
గొనుచు నెఱ్ఱనైన పదేళ్ళకూన పెదవి
చికిపి దీపమ్ము వెట్టిన చెలువు పరపి—

ఇచట నాకాకునడుమ పూలెత్తు మావి
గున్న నునుపచ్చవిల్కానిగొడుగుపైన



వానచినుకు కేకధారగా పట్టినట్లు
జల్లుమని వచ్చి వగరువాసనలు గొట్టి—
నేను నడచెడు పచ్చనినేలపైన
గడ్డిపూవులు నూత్నవికాసమొలికి—

ఈ మివుల చక్కనై మరెంతేని యంద
మొప్పు పూవులకారులో నొడలు తెలియ
కుబికిపోయిన తేనెలగుబురులందు
విచ్చిపోయిన రేకులపచ్చియందు
దగదగని క్రొత్తక్రొత్తయందాలు చూపు
బండిగురువిందపూవులు పచ్చగడ్డి
పూలు కంచెలవెంబడి పూచి పేరు
లెరుకపరచనిపూవులు నెన్ని మొన్నొ
జిలుగులొలికినతావులు చిమ్ముకొలిపి
అస్మదీయనాసారంధ్ర మంటబొడిచి—

“అయి మురళి” మానగీతమే యాలపించె

* * *

నాటిరే నిద్ర కన్నుల నాటుకొనెడు
ప్రొద్దుపోయిన నిసి గళంబున నదించి
“అయి మురళి” మూతపడిన నా యక్షులందు
నెదుట సాయంతనమున గన్పించినట్టి

పూవులకుటుంబములు నదంబులుగ వచ్చి
నాదు స్మృతి యంతకంతకు నాకు నెఱుఁగ
గాని నిద్రాంధకారమార్గములు జొనిపె.

* * *

పొలము వెన్నెలలో దూరభూమియట్లు
చిన్నతనమున కలిసిన చెలిమికాడు
ఎన్నొసంవత్సరములు కన్పించకుండ
కనబడినయట్లు తత్స్మృతికలిగినట్లు—

ఆ మధురరాత్రివేళ నా కందమైన
కల గని తదంతరమున పూవు లోకబారు
తీర్చి నాచెవులందు నదించినట్లు
"అయి మురళి" మానగీతమ్ము—

నిద్రమేల్కొని మేల్కొను నిముసమందు
తొలివిలిప్తలో స్మృతిలోన తోచె నాకు.



## వసంతము

౧

తరుణకోమలసహకారతరుకిసాల
యములు శిఖరకేతుపటాంచలములుగట్టి
కుఱ్ఱవాం డ్రెగబడి కోసికొనకమున్న
దులిపికూర్చిన వేపపూతలను తోర
ణములు సవరించి మధుకరానందరావ
ములును బికకన్యకారవములును వెంట
నదిమివచ్చు మేళంబులై యందగింప
మోహనవికాసరమణీయపుష్పపాళి
సొగసునాట్యాల మనసుమెచ్చులకు దార్చ
ప్రకృతిలోనున్న సంతోషభావమెల్ల
యొకపెడకు వచ్చెనోయన నొప్పులొలుకు
మందమందయానంబుల సుందరాతి
సుందరంబైన యరదంబు చూడు మదిగొ
వచ్చుచున్నది పూవులపల్లకివలె.

౨

కెలనఁ దరువులు తమనూత్నకిసలయముల
హారతులుపట్టు లతిక లింపారుకొనల

స్నిగ్ధబిల్వమ్ములట్టి వాసించు కన్న
పూలమాధ్వీమ్ము లూరేగు పొలుపులకును
పొలుపు లమరించ చల్లనిలలితభావ
ములకు బుట్టిల్లు నా మందమోహనాని
లములు వీవఁగ మదగజలలితగమన
సైఖరులు వెల్లిబజపుచు వచ్చుచున్న
ఆ విలాసరథం బది యక్షియుగము
పూర్వమునఁ జేసికొన్నట్టి పుణ్యఫలము
ఓసి నవమల్లికా! లేచి యొప్పులొలుకు
నడలతో హారతియొసంగఁగఁడఁగు మింక
ఈ వనంబెల్ల చలితమై యెసఁగుచున్న
దా రథంబు రాకకు, లేవవమ్మ నీవు.

౩

తతముహుర్ముహురుత్థసంతానపుష్ప
నాటికామందపవనము వనము నెల్ల
పులకితముచేసె సురనదీజలతరంగ
శీకరమ్ములు వెలువడి చిందువందె
ఈ మహావనలక్ష్మి రూపెల్ల ముదము
కరుగఁబోసినగతి పల్కుఁ దరిమి తరుము
సోయగము నించుకొన్నది చూపఱులకు
నయనయుగమహాసౌఖ్యసంధాత్రివోలె



ఏ రేవతు! వచ్చుచున్నట్టి వీరటాంత్రము
ఒకరొకరి చెట్టబట్టుకు నొదిగిదిగి
అమృతలజ్జాభినయముల వరుగుదెంత్రు
ఓహోహో! విూ రటమ్మ! రం కుత్సవమ్మ
అయినగుడు విూరు లేకున్న అసలు జరిగి
నట్లె యుండదు మాదువనంబులకును.

౪

కనఁబడియుఁ గానబడని చక్కనగు సామి
రథికుఁడైనాడు, నీవు సారథివి, పూట
పూట కొకవింతసోకులపుట్టినిల్లు
వమృతమూర్తివి, మాధవా! సుమసురభివి
నీరథం బెక్కి యందంబు నిట్టవోడిచె
నో యన మెఱుంగునగవుల హాయసు కాడు
ఆ రథికమాళి యెంత యవ్యక్తమధుర
మూర్తి మామానసంబులు మూలముట్టు
నెగచి యువ్వెత్తుగొనినాడు, కదవపోత
నీమనోహరసౌందర్యనిర్ఝరంబు
విూయిరువురిసౌందర్యముల్ మా యనంత
భావనైశ్చల్యఫణితులు పాడుచేసె
మాహృదంతరవీథుల మడఁగియున్న
యొకవికారమ్ము తలచూపుచుండె నేలో!

నే
ముద్దరాలవు మ మ్మెంతమోసపెట్టి
లా వ్రజకుమారవహాళికి నంగభవుని
వేసమును సంతరించి యీ వీథులందు
నీ వసంతునియరదంబు నెక్కి బయలు
దేరదీసితివమ్మ! రాధిక! బళిబళి
నీవు నవ్వుమ్మగా రతీదేవివుంటి
వగు మొదల గుర్తుపట్టలేదమ్మ నిన్ను
ఈ నవాభీరకన్యకలెల్ల పూల
వేసములు కట్టినారలు వింత లగుచు.
ఓ వసంతుడ! మాకు నీ యోగ్యతలును
మనసునచ్చెను, నీ వింక మాయెడలను
స్వేచ్ఛగా విహరింపుము, విశ్రమింపు
నీ యరదపగ్గములను బూని వనమెల్ల
పోవుటకు సిద్ధమైనాము రా, వసంత!



## కవి భృంగము

కవిభృంగము :

నే నాశాంతములం జరించి దిగిభస్నిగ్ధార్ద్రగండస్థలీ
దానాంబూచ్ఛయ మాహరించుకొని నిత్యశ్రీమనోజ్ఞాకృతి
స్థానం బౌదు నటంచు బెంచుకొని యాశల్ ప్రోజ్జ్వలద్గీతికా
మానాంభోనిధులందుమున్కలిడుచుందున్ సాంధ్యకాలంబులన్

ఇవి నానాప్రసవంబులం దిడిన నా యీ పాదచిహ్నంబు లీ
నవమాధుర్యరసార్ద్రవాహినులలోనన్ మత్పరాభ్య స్తవా
క్షీవహంబుల్ మధురంబునై మృదువునై నిర్ణీతమై చిక్కనై
ప్రవహించున్ దివిజాపగాగళితజంబాలాంబుసంబంధమై.

కోకిలాంగన :

చివురాకుకొసలోన చిటిలిన మెఱుపు
నవమధుశ్రీదేవి నవసిన మఱపు
తేజవ్వనమ్ము వాలిన పూవుకన్నె
గాజువారిన రేకగమి నవ్వు చిన్నె
నాపాట తేనెలో నవనవలాడె
నాపంచమమ్ములో నవకమ్ము దేర
ఇన్ని పూవులమీద నెసలారు తేటి
కన్నె క్రొంజివురాకుగమక మే మెఱుగు

కవిభృంగము :

నేను నీవలె ప్రపంచింతు పంచమము
తానమెత్తి మధుస్రుతములు పారింతు
సంజకెంజివురాకుచాయలో నిలిచి
క్రౌంజల్వ మొగిలులో కొసలెల్ల వలచి
తొలిపూతమావిమోకలసిగ్గుపొరల
పులకించె నాగీతికల తేనెపెరలు

శుకరాజు :

ఫలరసంబులలోన గలసిపోయిన రుచుల్
పులకరించినవేళ
చెలమలూరినవేళ
నవరసాస్వాదనానందవారిధిలోన
తటతరంగము విరిగినే కెరటాలు
చిటిలియొడ్డున చిందెనే చివురాకు
తుటుము లేటికి వచ్చెనే పువుతేనె
కటుతి లెచ్చట దాగునే

కవిభృంగము !

చివురాకుచివరలో పువుకన్నె పొంగులో
నాపదమ్ములు సోకి
నారదమ్ములు దాకి



వన్యప్రసూనాంగనావయస్సరసిలో
పులకలై పలవలై చిలుపబుగ్గలు పుట్టి
పసరుపిందెలు పుట్టెనే అవి పండి
ఫలరసాకృతి పొందెనే
ప్రకృతి మీకై నాకునై కూడ నొకటిగా
చకితలోచన యార్ద్రశాంతమూర్తి వహించె
ధ్వని మంజులమ్మై సుధాభారవహమైన
భోజనమ్ములలోన పాలుపు లేటికి లెమ్ము
అహము నిర్జించి యానందమూర్తివి కమ్ము
పోద మందర మీ సుధాదివ్యపథమున.

ఉద్యానము :

తలిరాకుగొంతుకోతల సన్నజీర సా
గిన తేనెబిగువు కోకిల మె మెఱుగు
మెత్తదనమెల్ల కోకిలే మేసిపోయె

ఆ శ్ర మ ము :

ఫలఖాది శుకరాజు వాగ్గుంభనమ్ములు
వాగర్థసంపృక్తతాగమములు
సొగసు నుడికారమెల్ల యా శుకమె మెఱుంగు

సరసి !

అలితసుకుమార రాగమ్ము నాలపించి
దిక్కులను రంగవల్లులు దీర్చు పికము
పలుకు నుడికారమున సముజ్జ్వలత దాల్చి
కడగి వాఙ్నియంతృత్వ మాకట్టు చిలుక.

గుణముల్ దోషము లేల యెన్నికలు నీకున్ సాటియే లేదు నీ
ధ్వనిసౌందర్యము పుష్పవాటికలలో వ్యాఖ్యానరమ్యంబ యు
ష్మను సప్తస్వరముల్ భవద్గళమునం దేపారె దివ్యన్మహా
ధ్వనిరాజ్యంబున నీకె కట్టితిమిరా పట్టంబు, పుష్పంధయా!

కవిభృంగము :

సరసి! నీశిశిరపృషత్పరంపర సోకి
విరియు పూవులలోన విశ్రాంతి గనుచుందు
నీతరంగములపై చెరలాడ చనుదెంచు
శ్రుతివాయువునకు స్వాగతము పాడుచునుందు
ప్రాచీదిగంగనాపలితహాసములలో
మోచాఫలశ్రీలు పాలపింతు గీతిలో
కమనీయ మగు దేశకాలపాత్రములతో
నమృత మస్మద్గీత మఖిలమార్గము లేగు
నానామహాగీతి నవ్యరాజ్యములతో
నేను నేర్వని దేదే నేనె సమ్రాట్టును.



## కాలపురుషుడు

శోకాధిదేవత :

ఈ హృదయాగ్నిధూమశిఖ లేమొ యనంగవిలోచనంబులన్
బాహిరిలెన్ దమస్సులు ప్రభావతిరస్కృతి పొంది శోకబా
ధాహతమైన నాబల మధఃకృతిపొందె గతాసువట్లు నా
దేహము కొయ్యబారి గణుతింపదు కాలగదాభిఘాతముల్.
ప్రాణమ్ముల్ సారవోవుచున్నయవి హృద్బాధావహంబుల్ సదా
క్షీణక్రూరమహాహిరాడ్విషసమాకృష్టంబులై నట్లుగా
శ్రేణుల్ గట్టి ననున్ వరించుటకు వచ్చెన్ గావలెన్ దుఃఖముల్
నేనేపో కనిపించితిన్ విగతసంధిన్ సంరుజాపీడితన్.

కరుణాదేవి :

ఈ రోదిల్లిన యీమెకన్గొనలయం దింతింతలై బాష్పముల్
ధారావాహికగట్టి దిగ్యువతినేత్రమ్ముల్ గళత్సూర్యసం
ధ్యారాగచ్ఛవి నెట్టిబారినవి సిక్తంబై కవోష్ణంబునై
మారెంబో కరుణాసనాథమయి బ్రహ్మాండంబు శోకార్తిగా.

ప్రకృతి :

ప్రతనుమ్లానశరీర యీమె యెవరో పాపంబు శోకాధిదే
వత లాగున్నది, తీవ్రశోకదహనజ్వాలోగ్రమాలానివా

...తసౌందర్యవినష్టరేఖ యయి సంలీనాస్మదాకారక
...ప్రితశోకాగ్నివమచ్ఛిఖాకృతి విడంబించున్ సబాష్పాక్షియై.

మాకందతరువాటికాకోమలపికీని
కూజితామృతములో కొఱతకలిగి
పున్నాగవాటీప్రసన్నమాధుకరఝం
కారరావంబులో కసటుపుట్టి
గంగాస్రవంతికాకల్హారమాలికా
ఫుల్లపత్రము లందమెల్ల పోయి
వనరమాధమ్మిల్లవాసితప్రసవమా
లాభూష లూరక మ్లానములయి
విమలసరసీతరంగాగ్రవిహారమాణ
రాజహంసీగరుచ్ఛేఖరములు కప్పు
వడి మహానందరసధునిన్ ప్రకృతిమూర్తి
నైన నాచారుసౌందర్య మలసిపోయె.

కాలపురుషుడు :

ఇదియును శోకదేవత వహించిన వేదన పాలుపంచుకొ
న్నది తనయంతటన్ ప్రకృతినాపయి సుంత తదీయచిహ్నముల్
పొదలవ యల్పభామపరిభూతల వీరల జూచినంత మ
న్మృదులదృగంతసంవలితరేఖల చిర్నగవుల్ ఫలించెడున్.



ఆనందదేవత :

నాయెదలో పరిమళసనాథములై పొదిలెన్ కుమారభృం
గాయుతమాలికాభ్రమరితామృతనవ్యలతాంతసంతతుల్
ప్రేయఉదారభావసుపరీతమనోజ్ఞ వసంతమోదల
క్ష్మీయుతమూర్తి నేను పులకించితిపో నిలువెల్ల ప్రేల్మిడిన్.

తను వానందరసంబు పెల్లుబికి యంతంబర్వి స్వేదోద్గమం
బును నానందసరోవగాహనసముద్భూతప్రశైత్యంబు చే
తన రోమాంచము పొంది తన్మయత సంధానించి నేత్రార్ధమీ
లన నీపై రనుమీయమానసుఖడోలాకేళికం జొచ్చెదన్.

ఊహాదేవి :

చివురులపాన్పునం దొడలు చేరిచి కూరిచినట్టి మంచుబిం
దువులసరాల ముత్తెముల తోరపు చల్లదనంబుచే నొడల్
నవకము దేఱ చొక్కపు టనంటులక్రొంజివురాకు దట్టపుం
జవి కెలలో సుఖించెడిని చాన ముదాత్మకమూర్తి కావలెన్.

సతతానందమనోజ్ఞగీతములు పెల్చన్ సప్తపర్ణాభిని
ర్మితకుంజాంతరవీథి మ్రోయుచు సుధాభృత్కంఠనిస్వానము
జ్జితలోకంబుగ పొల్చు నీమధురతాసీమన్ విలోకించి నా
మతి నూహించెద నీమెమోతుఁ యువతీమాణిక్యమే యం చొగిన్

ప్రకృతి :

విరిసి దీపమ్ము పెట్టెదను పుష్పితరమ్య
మందారకన్యకామధురమూర్తి
వెలుగారు రంగవల్లులను దీర్చెదసుమా
నేక శేఖరహిమానీకణముల
మెలపారు సొగసుపచ్చలతోరణములు కూ
ర్తును కీరపాళీగరుత్ప్రభాళి
నీడలు పట్టింతు నిభృతానిలప్లవ
త్రిసితనీరదాంగనాప్రతతిచేత
నపుడు పాడింతు నీరజస్యంది మధువు
చిలకరించెడి గీతికావలుల కోకి
లాంగనలచేత మందానిలములచేత
నమలినానందగేహాంగణములయందు.

కాలపురుషుడు :

ఇంత సౌఖ్యమ్ము నానంద మింత నాదు
మొగమునందలి గంభీరముద్రలందు
చిహ్నమేనియు లేక నశించిపోవు
నరసినకొలంది రూప మేర్పరుపరాక.



## శ్రీహర్షుఁడు

లోకము :

అర్థమ్ములేని కావ్యము లేర్పరించు వి
ద్యావేత్త యెవఁడు? — శ్రీహర్ష సుకవి
తనకవితార్థమ్ము తానే యెఱుగనట్టి
యనఘుం డెవండు? — శ్రీహర్ష సుకవి
మూలమూలలశబ్దముల దెచ్చి శ్లోకము
లల్లువాఁ డెవఁడు? — శ్రీహర్ష సుకవి
తలకొట్టుకొనిన బ్రద్దలుకాని కఠినపా
కాచార్యుఁ డెవఁడు? — శ్రీహర్ష సుకవి
ఎవఁడు శ్రీహర్షసుకవిరా జెవనికవిత
కర్థ మిది యని చెప్పరా దతఁడు - ఎవఁ డ
తండు మారుమూలలపదార్థములు తెచ్చి
కోమలేతరకవనమ్ము కూర్చువాఁడు.

శ్రీహర్షుఁడు :

ప్రాక్పరిపూర్ణ వాక్సుకవిపండితప్రౌఢవిలాసభావస
మ్యక్పరిపుష్టముల్ పరిణతార్థము లెన్నడు నేర్వఁబోక దు
ర్వ్యాక్పరిదృప్తులౌ కుకవివర్యులతోవల వందిమాక తా
దృక్పదయోగ్యమే 'అమితతేలిక' కావలె వారి కెప్పుడున్.

గాంగోషస్సరసీజగర్భకుహరాగ్రస్యందివార్బిందుభుక్
భృంగీభంగతరంగగానలహరీరీతుల్ ప్రసంగించు మత్
సంగీతమ్ములలోపలన్ జిగికొంతల్ వెట్టరాదే త్రయీ
శృంగారోచిత నీలకైశికశిరస్సీమంతముక్తామణీ!

మద్గీస్స్వచ్ఛపథాంతరధ్వనితశంపామేఘనాదాఘసం
పద్గండూషితదివ్యయోషిదమృతస్వచ్ఛార్ద్రగండస్థలీ
సాద్గుణ్యాంబులునున్ నిరర్థము లంటస్మత్కంఠనిస్స్వానముల్
గాద్గద్యంబయినన్ ఘటించదగదే ఖండేందుచూడామణీ!

విమలతరార్థభావపదవీపదవీక్షణచారుతామనో
జ్ఞము లగు నేత్రయుగ్మమున జూదిన నీపదలాక్ష జేసి ర
క్తిమ ఫలియించె నాకనుల క్రేవల నీదెస నిత్యచింత నా
యెముకలలోన గూళ్ళుపడెనే, రమణీయకళాతపస్వినీ!

ప్రౌఢసంఘట్టితోభయబాహుకూలంక
షస్తనోజ్జ్వల నికషంబు లేక
మేఘగర్జన్మేఖలాఘంటికాక్వణ
క్వణనరమ్యనినాదఘటన లేక
కేళీప్రకూజన్మరాళీనదన్నూపు
రాళీమనోజ్ఞస్వరాళి లేక
మృదునాగవల్లీసమీచీన గండసం
క్రాంతముల్ కుండలప్రభలు లేక



కలిత మాయాభిధాన రాక్షసవిమోహ
కారణోద్ధతనృత్యవైఖరులు లేక
అలసగమనమ్ములతో నడయాడు మింక
అంబ! భారతీదేవి! తుభ్యం నమోస్తు,

సరస్వతి :

నీకావ్యమ్ముల శబ్దగౌరవము తన్నిర్ణీత మర్థమ్ము వే
ళాకోళమ్ములు గావు తత్కృతరసాలంకారశయ్యాదులున్
నాకున్ గేళివిహారభూములు చలన్మందారరక్తాంబుజా
శోకానేకమరందముల్ వలచు నీసూక్త్యర్థముల్ సత్కవీ!

చికిలిమెఱుంగు సన్ననగిషీపని బంగతుసేత మెచ్చలే,
రకలుషమా వనాంతరమహాఝరిణీపరివేగ మోర్వలే,
రకృతపరిశ్రముల్ శ్రమగతాలసబుద్ధులు వారి మెచ్చుకో
లోకపని పెట్టుకొంటి వవు, లోకము నిన్నిక మెచ్చులే, కవీ!

# మనుష్యుఁడు—దయ—నిర్దయ

దయ :

అదివరకు మూడునాళ్ళుగ నాకసమ్ము
మసుగుమసుగుగ నుండి యా మరుదినమున
తెలవిచ్చినయట్టులే తెలవిచ్చి
మాచుచునె యాకసంబు మూసుకొనివచ్చె.

నాలుగు జలధులు నేక
మ్మౌ లాగున కుండపోతయై పెనువత్తై
ప్రాలినమబ్బులు దిక్కులు
నాలుగొలసి మూటకట్టినట్లుగ జాలిచెన్.

అసలు నిజముగ గాలికి నగ్ని మిత్ర
ము నను పేరు యాదాలాపమునను వచ్చె
గాని వాననే స్తన్న నెంతైన దగును,
అదుగొ వాన, యీదురుగాలి యాచి కొట్టె.

నిలిచిన ప్రాణము పాపము
నిలిచినచో నిలువలేక నెలు త్రొక్కులై
కలగుండువడియె నటనట
నలనలబహుజంతువులు నిరాధారములై.



ఒకమేకపిల్ల యెచటిదో
వకవకపడి దేహమెల్ల నలిగి వడంకై
చకితదృగంతము ప్రాణము
లకు నెలవై చూరుకడ నిలంబడియుండెన్.

ఆ గేస్తు చూచి తనచూ
రాగిన యా మేకపిల్ల నదలిచి తరిమెన్
ఈ గేస్తు చూచి తన చూ
రాగిన యీ మేకపిల్ల నదలిచి కొట్టెన్.

ఆ చూ రా చూరై పది
యే చూరున నినువరాని యెడరై చిరుగొం
తూచిన 'మే' యను సవ్వడి
నా చలిగాలికిని బిగిసి యది పరచె దెసల్.

ఒకవానజల్లు పెనుగా
లికి త్రోతలుపెట్టుకొంచు లీలాప్రళయా
ర్భకరఝంఝవోని వైఖరి
కకావికలుచేసినది జగమ్ము నలుగడల్.

*　　　*　　　*

మెడమలగి మృద్వికారమహా మేకపిల్ల
శవము గన్గొని ప్రతివారు జాలిపడిరి
జనములందరు తమతమపనులమీద
తరలిపోవుచు మరునాడు తెలవిచ్చి.

నిర్దయ :

అది పదేడులు కాచిన దా బజారు
అదివినా దొంగదోపిడి యాను వీథి
దానిపులిమోము గనునొని దాని సింహ
రవము విని దొంగ లా లెక్క-రారు జడిసి.

అది వయసుమీరి ముసలిదై అన్ని యుడిగి
దౌడ లొగిజారి యొడలెల్ల చీడబట్టి
ఖంగుఖంగున దగ్గుచు కదలలేక
నకనకంబడి యమయాతనపడుచుండె.

మును 'శేరిభైరీ' యని జనము పిలిచి
దృష్టితీసి నన్నము సమర్పించువారు
శునక మది, దాని దగ్గను కనబడినను
వినబడిన గఱ్ఱతోగాని విసరబోరు.

చైత్రవైశాఖములు పరస్పరము కుట్ర
చేసి పెనుచండ్రనిప్పులు చెఱిగిపోసె
అగి పుల్ల్రాగుచునె మడియంగబడిరి
అచి వడగొట్టి చలివేంద్రలందె జనులు.

అ కుక్క వచ్చి వేసగి
కాకకు తిరుగుళ్ళుపడి మొకామొకిచని యే
వాకి లొాదుగు లగుడభయ
వ్యాకులమై పఱచలేక పఱచె నలుదెసల్.



పడతి యొకర్ఱదెబ్బతో నడుము విరిగి
ఎండమండినవీథి కాళ్ళీడ్చుకొనుచు
పోనుజాలిన దూరమ్ము పోయి యచట
కదలజాలక యొకగోడ కొదిగి వ్రాలె.

తనజీతము బత్తెము ము
ట్టనికొలువు తలంచికొని కటకటంబడి చా
వని తన స్థలాభిమానం
బున నూరును కనులజూచు మొగినే చచ్చెన్.

* * *

ఈ వెధవకుక్క యిది గవులెత్తిపోవు
చున్న దనుచు నసహ్యించుకొన్నవారు
అల్ల మరునాటిమధ్యాహ్నమందు నూరి
వెలుపలికి వెట్టిచేత నీడ్పించినారు.

## గొంగళిపురుగు

వారిదొడ్డినుండి వ్రాలి మునగచెట్టు
మరిదొడ్డిలోకి విఱుగగాచె
పులుసు చారు పప్పుపులుసులకై కోయ
కోయ మంచు కన్నుగొట్టి పిలిచె.

గడ యెట్టివారికిని గ
న్పడకుండగ నెంతయొడుపునన్ గోసిన క
న్పడనే కన్పడె, చివరకు
లడాయిక్రింద దిగె, జెప్పి లాభము లేకన్.

ఘరవా యేమిటి నాల్గుకాడ లవి యప్పా! కోసికోని మ్మనన్,
తరువా పిండెయు గోయనీయననునంతన్ స్వామి వా గ్గోయనున్
పరగన్ వీరలు తిట్టిపోయును, గ్రమప్రాప్తిన్ దగాదా సరా
సరి పేటెత్తెను, నౌనుకా దను వివక్షన్ జర్మనీయుద్ధమై.

కాదు, మాదొడ్డివ్రాలిన మాదె యనియు,
ఆకుపడిదొడ్డిచెడుచుండె ననియు, నట్టు
లేని మీచెట్టుకొట్టివేయించు డనియు
మడతపేచీలు నొకవంద పడియె ననుము.



కావేషమ్ములు పెరిగెను
దావాపడె దీర్పువచ్చె, దరు వెంతయుగా
నావైపు వ్రాలె నరుకగ,
నావైపే వ్రాలె, దరువు నఖిలము పోయెన్.

వెధవలకు జెట్టు కొట్టించివేసినా మ
టంచు వీరలు, నికగోయ మనుము కాడ
లేమి కోయుదు రింక నంచేమొ వీరు,
వెలుతు రొక్క-కోపపుసిరి విరుగపాటు.

తరువుమోడున గొంగళిపురుగుబలిసి
పక్షపాతంబులేకుండ వారి వీరి
రెండుగృహముల బ్రాఁకాడి తిండియైన
నిట్టె నొకరెణ్ణెలల్ తిననీయలేదు.

## తల్లి

నేను కారాగృహంబులో నిగళబద్ధ
పాదయుగళుండనై నిలంబడితి! నన్ను
దీయదృక్కులు మత్పదద్వితయనఖర
శేఖరంబుల నిశ్చలస్థితి దనర్చు.

అంబ! నీచుఱచూపు లే నాగజాల
నని, యువనతాననుఁడ నెంచు నిలుచుంటి
గాని, మైయుండనోపు నీ యాననంబు
శ్రీదయావాహినుల కద్రిశేఖరంబు.

మఱచిపోయితి దోషముల్ మత్కృతములు
ఒనర శిశిరాతిశిశిరమై యొప్పులొలుకు
నీకరాంభోజయుగమున నిమిరినావు
నాశరీరమ్ము నేను తన్మయత నుండ.



## అకాలగానము

కోకిలా! నీదు పువుదేనెకూతలందుఁ
దీపితగ్గిన దేమి? యుద్యాపనమ్ము
సంతరించితివేమొ, వసంతవేళ
నీవుపూనిన సువ్రతనిష్ఠ మాని.

మావిచివురులలోని కమ్మందనమ్ము
తొలి ముదురుకారునవకముతోడ నాడిచె
మొగిలుబెదరింపులకు లోఁగి ముగుద లిండ్లు
వెడల, రీ వేల మానేల విడువలేవు?

పికిలిపిట్ట లూడెదు నీలలకు నొకింత
యొదుగవలసెను నీదుకుహూస్వనంబు
కాలగతి మేరుశిఖరము కప్పగప్పి
యుండవచ్చును కాటుకకొండరీతి.

నీదుగానమ్ము తఱిగిన నెలలగొంతు
సాటు వనుబట్టి తొలికూత సాగు తటిని
పూవుదేనెల చిందించు నీ వటన్న
భ్రాంతి వినెదము కోకిలా! పైడిగంట.

బహుళకార్యార్థులై చన్న పతుల బాసి
వగచు చానల యా తిప్పె తగిలె నిన్ను
కాకపోయిన బూవులకారునందు
నా దినంబుల నీగాన మాగలేదు.

జలజల స్రవించు నేఱు వేసంగియందు
పిల్లకాలువగతి సన్నగిల్లుగీతి
వానచినుకంత వైశాల్యమైన లేక
చిక్కె నీ వాకుపువుదేనెచిఱుతకాల్వ.

లేఁతచివురులతోడ మల్లికలతోడ
కొమరు పూదీగగమినిగారములతోడ
జనులయూసలతోడ వసంతువెంట
పరభృతమ! నీదుపాటలు తరలిపోయె.

లలి వసంతమ్ము నీవు తేనెలు స్రవింప
చెంతఁ దనకై తజిగి సరిచేసికొన్న
సుకవి నీ వాకులో నున్న సొబగు జీర
నును మెఱుంగులపోకకై నొచ్చుకొనియె.



## మల్లిక

ఒక్కచొక్కపు నవమల్లి మొక్క తెచ్చి
నావిలాసపుదోటలో నాటినాను
సాంధ్యనవరక్తకాంతిపుంజములనీటు
వెళ్ళగ్రక్కిన దా చిఱుమల్లె మొక్క.

నాటిరాతిరి నిదురించినానుగాని
ప్రాణములు సర్వమును మొక్కపైనె గలవు
ప్రక్కపైనుండియే మల్లెమొక్క బిలిచి
'యెంతయెదిగితి' వంచు బ్రశ్నించినాను.

'చాల యెదిగితి' నన్నది పూలమొక్క
'నిజమె కాబోలు' నంచు కన్విప్పినాడ
ఎదుగలేదు సరేకదా, మొదలుకూడ
నాటుకొనమిని వాడియున్నయది మొక్క.

ఆ దినంబున నాహృదయంబు మొక్క
యెదుగలే దని శోకసంవృతమ యయ్యె
ఎప్డు ప్రొద్దుగ్రుంకినదొ, యింకెపుడు రాత్రి
వచ్చినదొ, యెప్డు నిద్దురపట్టినదియొ ?

ట్టిపై నెదిగితే యన్నమాటతోడ
దురమేల్కొంటి, మొక్కయు నెదిగినాన
యన్న, దిటుచూచితినికదా, యున్నమొక్క
యున్నపాటుగ చనిపోవుచున్న దకట !

గాటపువిషాదభరమున కమలిపోయి
శైశిరమరుత్తరంగముల్ రాశి తెచ్చి
అమృతవాఃపూరమృదుతరంగముల తెచ్చి
దానిప్రాణమ్ములను నిల్పినాను నేను.

మరుదినంబున నాముద్దుమల్లెకూన
యెదిగితివ ! తల్లి ! యంచు ప్రశ్నించినాను
అప్పుడే మొక్క డెదుగుట యన్న దామె
అర్థవిస్పష్టలజ్జాస్వనాంచితముగ.

గంధసారద్రుమవిసర్పి కాలసర్ప
చటులదంష్ట్రాచ్యుతమ్మైన చల్లగాలి
పరువులెత్తెను మల్లికాంకురము పెరుగ
జొచ్చినది కన్దెఱచి యిట్లు చూతునుకద !



# తీయనిత్రోవ

తీయనికోకిలామదవతీకలకూజితపుష్పవాటికా
చ్ఛాయలయందు ప్రేమరససంభరితాంచలచంచలాక్షియై
ప్రేయసి తేనియల్ తొణుకు వెచ్చనియావనపారిజాతముల్
దోయిటబట్టి నాయెదుటదోచె నుపాయనరమ్యమూర్తియై.

ఓ యని పిల్చినన్ బలికె నో యన మాతలపైనికొమ్మలో
కో యని కూజితమ్మొలికె గోయిలకన్యక ప్రేమగీతికా
పేయరసమ్ము కానుకలువెట్టినపోలిక గుత్తిలోపలన్
జేయిడి యన్నము న్గొనెడుస్నేహితుమాదిరి వెల్లడించుచున్.

వేలుపుపూలదొంతరలవెట్టినదోయిలిమీద రెక్కలన్
వ్రాలకయుండ ప్రేమరసభావ మెఱింగినయట్లు షట్పదీ
జాలము చేతియంగుళులచాయల నూయెలత్రాళ్ళవోలికన్
మాలికగా ప్రదక్షిణసమర్చన సల్పెన జోలపాడుచున్.

మాగి ననంటిపండ్లరసమాధురి చొక్కినచిల్కదంపతుల్
మూగినకామపుంబరువు మోయగజాలక సొక్కినట్టి మై
తీగలవంచి మాప్రణయతీర్థపుపున్నెము సేవసేయ నో
నాగను బల్కె మా కెలననాటినచక్కెరకండ మొల్కగాన్.

వ్రాలిన కొమ్మకొమ్మకును బంగరుపిట్టలు జంటజంటలై
జాలులుజాలులై కిచకిచల్ కుడితెక్కలు సాచి, సాచుటల్
తూలిన తూలుటల్ కొదమతూగులు దక్షిణపాదనాట్యముల్
వ్రేలిన పచ్చవింటిదొర పెండిలితోరణముల్ రచించెడున్.

బంగరుతీవ విల్ చెఱకు వంచి రసార్ద్రిమనోజభావనా
సంగతులైన మా ప్రణయజంపతు లుండిన పూవుటీరపుఁ
జుంగుల నుత్తరీయమును సోకుగ గప్పినరీతి వేణికా
భంగము తీర్చె నొక్కసెల పాయలుపాయలుగాగ తీర్చుచున్.



## ఆశ్రమ ప్రత్యూషము

తరుణసహకారకుటజకోటరమునుండి
కోకిలము క్రోల్చె నొకభంగి గొంతుకెత్తి
తలిరువెన్నెలకాయుచందననగంబు
కందరమునుండి చల్లనిగాలి వీచె.

ముగ్ధభిల్లాంగనాశ్రావ్యముక్తకంఠ
తరుణమంజులప్రణయగీతములు వచ్చె
సవిధవంశీనికుంజపుంజములనుండి
సమదమధుకరమధురగీతముల కలిసి.

తనతోడ తలాడగా పండుకొనిన తపసి
కదలికల మేలుకని మునికాంత చూచె
లేతనెలవెన్నెలల తల్లి లేడి నాకు
టపుడ ప్రసవించి తనబిడ్డయంగకముల.

అమర పరచిన దర్భాసనములపైన
నిండుగళమున మధువొల్క నిగమపాఠ
ములను వల్లించ మునిబాలకులదళమ్ము
విపినవీథుల చనుదెంచె వేదఘోష.

ఆశ్రమకుటీరముల వెన్క-నంటియున్న
గుట్టలకుపైన జాలుగా కురిసినట్టి
హిమతుషారస్రుతాంబుపూరములనుండి
జాలుగా సోనసెలయేరు జాలువారె.

పతికి మునుమున్న శైలగహ్వరమునందు
మేలుకాంచినబోయయిల్లాలు వినియె
మిలమిలని లేతనెలవెన్నెలలను మెఱయు
సెలలచప్పుళ్లు తమ్మికన్నులను మూసి.

తబిసికన్నెలచూర్ణకుంతలములందు
నవసి గాజువారిన జాజిపువులతావి
లలితలవలీప్రవాళశయ్యలను వీడి
తృణకుటీరాంగణము లావరించుకొనియె.

మునులవటువులు తొలిసంజ జని హరించి
సుంకు తేరిన మెదవు దర్భాంకురములు
అమరిచి బుజాలఁ జనఁ జివు ల్లందుకొనగ
దోనఁ జనుదెంచు పెంపుడుకూనలేడి.



## సన్న్యాసి

మొగిలిరేకులమృదులకపోలయుగము
కఱకుటెండలవేడిమి కందువాఱె
తెలిమొగులుచాటు నెలవంక తెఱగు బూని
బూదిపూసిన నీమోము ముఱుపు తఱిగె.

కన్నెపూబోడి గాటంపుకౌగిలింత
నవసి వసివాడు నీమేనిచివురు నేడు
కఠినహృదయమ్ము లేనియుఁ గఱిగిపోవ
కటికత్రానేలఁ గదుములు కట్టె నకట!

కావిపుట్టమ్ము కటిసీమఁ గట్టు భాగ్య
భోగ్యరాహిత్యమైన వైరాగ్యమునకు
జాజిపూసౌరభమ్ములజల్లు విరియు
జవ్వనమ్మున కెంతటిదవ్వు గలదు?

దివ్యకుసుమాంగి యీనెలుదీసి యిచ్చు
లేఁదమలపాకుమడుపులు గాదటంచు
హరిణశాబమ్ములకుఁ దృణాంకురము లిడఁగ
మనసుపుట్టెనె? యెంత యమాకుడవు.

మధురతరహాసచంద్రికాసుధ తొఱంగు
కామినీస్నిగ్ధగండభాగమ్ము లాను
కప్పురపుతమ్మతావుల కావిమోవి
బీటువడనీకు వైరాగ్యవృత్తి యేల?

# శారదా నృత్యము

జలజకింజల్కకషాయకంఠమున రా
గము ప్రసరించె బాలమధుపమ్ము
తరుణ మాకందంపుతలిరు గీరుకుపోయి
పాడె పంచమపల్లవమ్ము పికము
కాష్ఠేయవిమలశీకరశేఖరముల చ
ల్లనిగాలిజలతరంగిణి నదించె
యమునాతటత్రస్తసమదరాధాసతీ
హృదయకోరకము పరిమళించె
పార్వతీజానివోలె పాపంబునెల్ల
కంఠసీమ గదించి లోకశుభగీతి
పాడు సత్కవి యమృతశైవాలినీ త
రంగరమ్య గీః ప్రముదితారంభములను.

శిశిరాంశువిమలరోచిర్ముఖాపాంసులా
ధరసాంధ్యరాగపాథస్సులందు
కాదంబినీశ్రవఃకలితకల్హారపూ
జితములౌ సెలయేటివితతులందు



నైశ్చల్యనిష్ఠాసనాథుడౌ మునిరాజు
చిన్నిజాబిల్లి భ్రూసీమయందు
అఖలవిహంగవిహారయోగ్యమ్మైన
వైశాల్యమున్న ద్యోపథమునందు
శారదానాట్యమంగళచారుచరణ
కంజరేఖాంకితంబులు గానవచ్చు
చలితచైత్రనదీముక్తసైకతముల
తరుణముగ్ధసారంగిపాదములువోలె.

అభ్రగంగాధునీచుంబియైన నైజ
తుంగభంగతరంగాల పొంగె జలధి
శారదాదేవిమంజీరసరణి ఘల్లు
ఘల్లు రని మ్రోగినది. లయక్రమముతోపం.

## శబ్దబ్రహ్మ స్తుతి

అర్చిర్గాథపవిత్రమూర్తి యగు సంధ్యాదేవతంబోని ని
ష్కర్చింతున్ నమితాత్మదేహుడను నేత్రాంతంబు భక్తిప్రభా
వర్చస్వాంతముగాగ, నాహృదయ మిప్పట్లన్ మృగీనాభికా
చర్చాసుందరమయ్యె నీనుతుల ప్రజ్ఞాగీఃస్వరూపాకృతీ!

చేతోజారాతులు వి
ద్యాతరుణీప్రాణనాథు లావిర్భూత
జ్యోతిస్సులు బ్రాహ్మణులమ
హాతపముల నీవువోలె నాకృతిపొందెన్.

ప్రామునిదృష్ట మే కరణి బ్రహ్మపదార్థము నీలపల్లవ
శ్యామలమూర్తి సూర్యకులచంద్రుఁడు రామునివోలె నాయెనో
శ్రీమహనీయతాగుణగరిష్ఠము జ్ఞానముసైత మట్లె నీ
వా మృదుశబ్దమే పరిణతాకృతి దాల్చెను నీవ తానయై.

ఆరసి నిన్ను నీరజదళాంతరమోహననిస్స్వనంబుగా
గోరి యెఱింగితిఁ తెలిసికొన్నకొలందిగ నక్కటా నిరా
కారతపస్వి! నిన్ను వినగావలె, నట్టినినున్ శరీరసం
స్కారబలంబునఁ వినుటెగాకయు చూడగగూడ నెంచెదన్.



చారుతాననవోషస్సులద్విజులు కృ
ష్ణాంబుపూరంబుల నణగియుండ
మధురగాయకశిరోమణి భక్తుడై గళా
మృతవీణాశ్రుతికిని మేళవింప
పూర్వజన్మతపఃప్రభూతసత్కవివాక్కు
నీమహాస్తోత్రముల్ నిండి తొలుక
దైనందినాంత్యసంధ్యావేళ నటరాజు
కాలిపెండేరమ్ము ఘల్లురనగ
మేము లేచి నిలంబడి వాలితాక్షు
లము కృశీభూతఘోరకల్మషులమును 'న
మో నమస్తే' యని కరమ్ము మోడ్తు మిదిగో!
అమితపులకితదేహులమై భృశంబు.

మానుగ నాకాశంబున
ప్రాణములన్ మలచి తన్మయత్వము పొందన్
నేనే శబ్దబ్రహ్మం
బై నాలో నాకె వందనాదికమయ్యెన్.

# స్వాగతము

వెన్నెలతీవ చాలునకు వెన్కగ నేలకు డిగ్గివచ్చి యీ
చిన్నరిమబ్బుక్రొమ్మెఱుగుచేడియతో విహరించుచుండె, మా
పొన్నలు పూతపట్టు నిక, పొంతపొలాలకు నీర మెక్కెడిన్
మొన్నటిదాక వానలకు మోములువాచిరి కాదె కర్షకుల్.

నెఱియలుపడ్డ మాపొలమునిండను తుంగలు తుమ్మదుబ్బులున్
పెరిగెను, దుక్కిటెద్దడుగుపెట్టగజాలని మాపొలాలలో
నురుమద శైవపాదకటకోజ్జ్వలనాదమనోహరంబుగా
నురిమిన నీకొసంగెద మహో! యుపదల్ నవబాష్పబిందువుల్.

కూరలపాదులెల్ల పురుగుల్ మొదలంటగ నాకిపోయె, మా
కోరడివెంబడిన్ తలలు కొంచెముగా బయికెత్తు మొక్కలున్
తీరెను నీనినాదమున తేరుకొనెన్ బసరాకువేసి సిం
గారములొల్కెడున్ నిగనిగల్ వెలయించుచునున్న వో ప్రభూ!

అందపువానచిన్కు పడె నన్నదిచాలని ప్రాతవిత్తనా
లుందగదెచ్చి మాపెరటిలోపల పాతిన కూరపాదులన్
పందిరికెక్కనిమ్ము తొలివర్షపుచిన్కులు చిన్కి దొడ్డిలో
నందన మూడివచ్చిపడెనా! యనిపింపుము, సత్కృపానిధీ!



పొడిపొడిమై తలల్ముదిరిపోయిన యెఱ్ఱనికారుజొన్నలో
నుడుగక, క్రొత్తలో పసరుటుంగిడితాకిన యావుదూడలున్,
తడబడిపోయె, మాయెడద తల్లడిలెన్, తొలివానచిన్కు పై
బడి సుఖమయ్యె, నేటి కనపాయత నొందెను మాదుసస్యముల్.

గొంటరి వీవు మామదురుగోడను వ్రాలిన రావితొఱ్ఱలో
పెంటియు దాను నొంటి విలపించుచునున్నది పావురాయి నీ
వెంటనె చూచుచున్ గడపె వేసవియంతయు, నీవు వచ్చి మా
పంటలతోడిపాటుగ కృపామతి! దానికి దప్పిదీర్పవే.

ఒప్పులకుప్ప మాచిఱుత యూచినగొంతున వానవానవ
ల్లప్పలు తిర్గుచున్ జదికిలంబడు, కన్నులు వ్యాప్తమై కనుల్,
కప్పను వల్లెకుచ్చెళుల గాళ్ళకు, నృత్యముసేయ పెద్దన
వ్వొప్పగవచ్చి నాపదము లూరక కౌగిటబూను గట్టిగా.

పొలముల వట్టినీరములు బోదెలనిండవు, నాకుమళ్ళలో
చెలమలనీరు తోడి యరచేతులు బొబ్బలుపొక్కె, బోదెలో
పలి జలమందు పిచ్చుకలు పాపము! మున్కలుముంచుచుండె నీ
విలయము దాటిపోయె వినిపించెను, నీయుఱుముల్ కృపానిధీ!

నీకృపచేత రేపటికి నీరము లెక్కను మాపొలాలకున్
వేకువ నాటులై కలుపుతీయనిమళ్ళను నమ్మపూలు కా
జాకులు కాజపూలు తఱుచై కలుపేరెదు మాలపిల్లలున్
శ్రీకలకంఠగీతికలచే బులకింపగ జేతురో ప్రభూ !

పదిగిన బోదెకాలువలు నుబ్బెను మోటయు తోడకంబు సం
పదగల వంగచాలులకు మధ్యగ వేసిన గోగుమొక్క ల
ల్లదె కొనసాగె నే నెలకొ యందును కోతకు, గండపిల్కలున్
ప్రిదిలిన నేలపై బయలుపెట్టును పొమ్ము తలాకుపాట్లముల్.

పిపిల తేనెలై పికిలపిట్టల యీలలు నీకు స్వాగత
మ్ములొసగు, బైడిగంటగళముల్ శ్రుతిజేసి నుతించు వానకో
యిల కడుదీనమౌ కనుల నెప్పుడు నీ వరుదెంతువంచు నీ
వలనుకె చూచు బెగ్గురులు బంతులుతీరిచి నిన్ను గొల్చెడున్.

నీ వరుదెంతు వంచును ధ్వనించెను జల్లనిగాలిసోకుచున్
నీవలిచినక్కపడ్డ యవనీస్థలి గమ్మనితావి చిమ్మెడున్
నీవ ప్రశీతలాకృతివి నీ వొకరుండవె సేద్యగాండ్రకున్
కావలికాచు దైవమవు, కష్టములన్ గడతేర్చువాఁడవున్.

దొంతులు తెచ్చి కానుకలతో నెదురాదుము బంతిపూలు, చే
మంతులు, చంద్రకాంతములు, మంకెనపూవులు, పోకబంతులున్
వింతలఁ గన్నెరుల్, హృదయవీథుల మాయెడ విశ్రమింపు, మా
చింతలతోపులో విడిదిసేయుము శ్రావణమాసవేళలన్.

నీలాంభోధరకాంతిపుంజములు నిండెన్ ప్రాక్ప్రతీచీదిశా
లోలాభ్యంతరవీథికావళుల, నాలో గోపికాశ్రేణిలీ
లాలాస్యంబులు సేయునాదము శ్రవోలంకారమయ్యెన్ మయూ
రీలోలచ్ఛవిపింఛసంచితకళారింఛోళిసంఛన్నమై.



"అ - ఈ"

౧

అమృతప్రసవచారు వగు హంసతూలికా
మృదుశయ్యవోలిక మెత్తనైన
లలితకర్పూరశీతల మగు సాంద్రచం
ద్రజ్యోత్స్నవోలిక రమ్యమైన
ప్రాభాతగీతవిస్పష్టతరమంజుల
శ్రీగీతివలె సమీచీనమైన
కులపాలికాసముజ్జ్వలమందహాసరే
ఖాధీధితింబోలె క్రమమైన

మధురమార్గంబునం బడి మనుజులెల్ల
వరుసగా బోవుచున్నారు, వారివదన
మండలంబులు నవమధుమాససమయ
మల్లికావికాసమువోలె మాధురిల్లు.

స్వచ్ఛాంభోరమణీయమౌ మృదురవత్సంరంభకుల్యాతటిన్
స్వేచ్ఛాగీతములం దొడక్లెలుగ కాశ్లేషక్రియామంజులాం
బుచ్ఛాయానిలవీచికాతతి జనమ్ముల్ పోవుచున్నారు స్ని
గ్ధచ్ఛాయాతరుశీతలంబయిన మార్గంబందు సౌఖ్యంబునన్.

శ్రీక నా జనమ్ము లనతిక్రమణంబుగ బోవుచున్న యా
దారియ తీయు నప్పురముదాపున కద్ది సమస్తవస్తుసం
పూరితమై జనమ్ములకు బున్నెముప్రోవయి లక్ష్మినిల్వగా
తీరుగదై ప్రభావవితతీకృతనందనమై చెలంగెడున్.

౨

నానడచుచున్న పథము కంటకశిలా వి
షమము వక్రతమము క్రూరసర్పసంకు
లమ్ము భీకరమ్మును నిర్జనమ్ము ప్రతిప
దమ్ము హృదయభేదభయావహమ్ము, మఱియు.

ఈ కుటిలమార్గ మచటికి నీడ్చుచుండె
నన్ను, బుద్ధిపూర్వకముగ నన్ను నేన
యీడ్చుకొనబడుచుంటి నా యేగుచున్న
యా ప్రదేశము నిర్జంతువైన యటవి.

పథమునం బోవుచును భయంపడి, భయమ్ము
వాపుకొన నేదొ గీతమ్ము పాడుకొనిన
ధ్వని వినంబడి యెచటనో దాగియున్న
చోరశేఖరు డరుదెంచి సురియ విసరు.



# పిచ్చితలలు

౧

ఆస్థవిచిత్రలోభయిత యన్నిటి కన్నిప్రతుల్ ఘటించి భా
వి స్థనిరాశలన్ చిగురిపించెడు పచ్చనిపల్లెటూళ్ళగా
అస్థలమం దయోగ్యవిషయంబున నక్రమమై మనస్సునం
దే స్థితియున్ లయంబు గల వీ యనుభూతికిగాని సౌఖ్యముల్.

సౌఖ్య మటన్నదానికి నిజంబుగ స్థానముగాని నేను నా
లేఖ్యగతాకృతింబలె వ్యళీకత పెంచినదాని దీనికై
సఖ్యముపొందితిన్ ధృతవిషచ్ఛట మాత్తపురాఘమాలికా
ముఖ్యము దైవికంబు పరిమూఢము దండమె తోచునెచ్చటన్.

కర్మ బలీయమై నను నెగాదిగలాగుచు నల్పమైన వే
ధర్మములల్ల వానిదెస దట్టపుటూహలసేత ముఖ్యమే
ధర్మము తద్విమోచనపథంబున బల్చనియూహసేతగా
శర్మము వేఱు నాబ్రదుకుచా లిది వేఱుగ సంతరి[illegible]డున్.

తీక్ష్ణవిచారముల్ సలిపితిన్ బెనుగాలులత్రోవలో తతా
భీక్ష్ణ ముదారజీవితము వెంబడి శత్రునిరీతి ధీగత
శ్లక్ష్ణతబొంది వృద్ధకృకలాసముకై వడి డిల్లవోయితిన్
తీక్ష్ణకరుండు నన్నునుమతించెను వేసగి బెట్టనేలగన్.

ఓర్పు విచిత్రమౌ గుణ మహో! యిది నేనుగ మూర్తికట్టె సం
సర్పివిషచ్ఛటాసహము, మామక దేహగతాఖిలాణుమా
లార్పితమైనదింబలెను నైనది లోపల కాలి చిట్టమై
యేర్పడ నేర్పుగా నభినయించెడు నామెద పచ్చిపచ్చనల్.

బ్రాహ్మణుఁ డింద్రియప్రతతిపై నధికారముకల్మిచే సనా
బ్రహ్మపదంబు నొందునట! బ్రాహ్మణతాచ్యుతిపాటుగా మనో
జిహ్మత యింద్రియాపహృతచిత్తత అన్ని ఘటిల్లె నింక నా
బ్రహ్మపదంబు తా నెవరొ పాలసుఁ డే నెవరో నిజంబుగన్.

శప్తుఁడనై పరాభవరసంబున కాప్తుఁడనై మనోవ్యథా
లిప్తుఁడనై మహాగ్నిపరిలీఢతనూసకలాణుపాళినై
ప్రాప్తముమించి యజ్ఞులను బారలజాచెద సిగ్గునొందెదన్
తృప్త జనంబు లేనగవుతీరున జిక్కని నిందత్రోచగన్.

ఒక్కవంద వేయి యొకలక్ష యొకకోటి
బయలులేని కట్టుబాట్లు చూడ
ఇన్ని త్రెంచుకొంచు నెగురజాలనిపక్షి
చాలనట్టెశక్తి కేల నవ్వ?



## అసురలక్ష్మి స్వాంతనము

[ఈ పద్యములు ముందెప్పుడో వ్రాయవలయు ననుకొన్న రామాయణములో చేర్చవలెనని చేర్పలేదు.]

నాచేతన్ త్రిజగమ్ములున్ నిలుచు, నానాజంగమస్థావర
ప్రాచుర్యంబున కేన మూలము, జగత్ప్రారంభసంరంభవి
ద్యాచార్యుండను నేన, సర్వజగదాహ్లాదంబు నాహాస మే
లా చిన్నందన మొంద, త్రైభువనలీలాజేతనీలాలకా !

ముల్లోకంబులు చంద్రహాసశిఖరంబుం దాకి నొక్కుల్ వడెన్
చెల్లెంబో దశకంఠపౌరుషము దిక్సీమంతినీభోగ్యమై
కల్లల్ వల్కెడు మొక్కవోవనిది నాఖడ్గంబు ధూర్తద్విష
ద్వల్లీదుర్గమమార్గభీకరలవిత్రప్రాయమై, బిత్తరీ !

కమరెన్ దానవలోకశాత్రవవధూగండంబు లుత్ఫుల్లముల్
నముచిద్వేషిమహాభయంకరమదాజ్ఞాబద్ధమై నాల్గుసం
ద్రములుంగూడి ఘనీభవించి ద్రుతవల్గన్మద్రథధ్వానసం
భ్రమదాశాకరిణీశ్రవఃకుహరసంబాధంబు గావించెడున్.

బాలేందీవరకోరకచ్ఛవికి నింపా ! మాకరందాపగా
వేలోపాంతచరన్మధువ్రతకులప్రేమమ్ము సాధించుటా?
చాలుంజాలు, నిదేమిటీ పరిణతాంచన్నాగవల్లీప్రభా
లీలాసుందరగల్ల మిట్లగు టదేలే, బాలికారత్నమా!

ద్రైతేయకామినీధమ్మిల్లసుమపరా
గము గాలిచే గసుగందరాదు
దైత్యశుద్ధాంతకాంతాకపోలపటీర
చర్చ వెన్నెలలఁ జెమర్చరాదు
దానవాలోకముగ్ధాలోచనాంబుజ
శ్రీలు క్రొందేటు లాసించరాదు
దివిజాంతకావరోధవధూవిలాసభూ
ములు పచ్చవిల్కాఁడు దొలగరాదు

ఇది త్రిలోకైకవీర లంకేశపంక్తి
కంధర మహోగ్రశాసనక్రమము, ప్రకృతి
దీనిపై యధికారిణి, దివిజు లింక
యడుగడుగువెంట కత్తిపై నడువవలయు.



# కుక్కుటేశ్వరా!

పాపపురాత్రి మూసి, యపవర్గమహోరుగుణమ్ము [illegible]
తాపముచెందు నాయెడద దావకకుక్కుట[illegible]
శ్రీపరిడీప్తబోధ మురరీకృతకూజితమున్ వినంగ నీ
వే! పరమేశ! యీ నిశ వ్యయింతు వసువ్యథఁ గుక్కుటేశ్వరా!

ఏ నిశ రక్కసిఁ విఱిచి యెత్తిననెత్తురుతోడి చర్మమున్
బూనిన మాళితో గెలుపుమోసిన దర్పితమైన పుంజ నా
తానమువోని బోధవినదంబును జేయుచు నున్న యో ప్రభూ!
ప్రాణముతోడ నీకు బయిపందెముకట్టితి గుక్కుటేశ్వరా!

పలపల నింతయింత తెలవారెనో ముక్తిరమాఖ్యకుక్కుటీ
బలవదమోఘసంగమనిబంధముతోఁ దొలినాటి వైరపుం
జలమున బట్టి మన్మథుని చంపితి వేమి పగో మహాప్రభూ!
యిలపయి పాపచెల్మిఫల మెచ్చటికేగును గుక్కుటేశ్వరా

అగు నిగమంబులందు నిగమాంతములందున విశ్వసింతు నా
నిగమములున్ దదంతములు నీ వని రాయిగ చూతు నల్లరా
యిగ నిను జూచుచున్ మఱియు నిట్టులె పుంజుగజూతునేమి నీ
సొగసగుఁ జేతలోని పలుచూపుల కైక్యము కుక్కుటేశ్వరా!

...లపయి మెఱ్ఱజుత్తు నరుదారగ నల్లనిగొంతు సర్వమున్
...లుపగు మేనితోడ నినదించెడు చిక్కనికోడిపుంజు, కూ
...లును నుపస్సహస్ర ములుదారతరంగతరంగపుష్పప
...లములు సృష్టిచేసెడు ప్రభాతముఖంబులు కుక్కుటేశ్వరా!

...దగలేని మొండి వగు మామకకల్మషతామ్రచూడ మా
...దమనాగతాహవవిలంబన మోర్వక గ్రుక్కబోకు నా
...దిలిపుంజ! చంకనిడి క్రమ్మి నినున్ ముకుకోళ్ళలోన నీ
...ల్పదిననైన దేరుకొన వోయి! మహాప్రభు! కుక్కుటేశ్వరా!

ముట్టకొసన్ ధరాశకలమున్ దొలి పోత్రి వహించె నద్దియున్
చిట్టలా! పీఠికానగరి చెంతను కుక్కుట మొండు ముక్కుతో
బట్టెను బో యుషఃప్రభల ప్రాగ్గగనోజ్జ్వలఖండ మాత్రిలో
పుట్టె మునుంగుజీవులసముద్ధృతికోసము కుక్కుటేశ్వరా!

అడరిన మాయకోడి యొకయామిని వేళకు గుఱ్ఱకొయ్యలుం
బాడువకమున్నె గేహములపాంతలకూసి జనున్ గృహంబులన్
వెడలగ జేసెడున్ గికురువెట్టెడు నింద్రుని కింద్రుడైన యా
గడుసరికోడిచే గృహసుఖంబులు దక్కనె కుక్కుటేశ్వరా!

కొనముకు వాడియా కితవకుక్కుటరాజమ! నాయెడందలో
దనరు నఘాళికీటములు దాచి పుటుక్కుపుటుక్కు మంచు ము
క్కున విదలించవే! విద్రుచుకొంచు దదంతరమందు నాదు జీ
వునివలె నున్న పెట్ట బెడపోకిలి ద్రొక్కవె కుక్కుటేశ్వరా!



# ఆకాశదీపము

[పూర్వ మెప్పుడో యొకనాడు శైవ దివ్య కార్తికాకాశ దీపము నామనసులోకి జూచినది. ఏటేట కార్తికము వచ్చినది, పోయినది. నేను క్షణియించితిని. ఆభావము మ్రొక్కుకోని తీర్చుకొని మ్రొక్కువలె గుత్తుక మీద కూర్చున్నది. అసలు ఋణమే చెడ్డది. అందులో శివఋణము మఱీ చెడ్డది. పదియేండ్లక్రింద నింత దక్కునో దక్కదో శివదేవునకు. నే దది వడ్డితో గుంజుకొనినాడు]

ఇంద్రియముల్ కుదించుకొను హృత్కళికాస్థితసంవిదాకృతిన్
చాంద్రమసంబు మేఘపరిషత్పరిక్లప్తము రేఖకై పడిన్

సాంద్ర తమాలికా జరఠశాఖికలో దుదిపూవువోలికన్
తంద్రసుకార్తికీఘటగతప్రభుదీపిక తా జయించెడున్.

పాపపుబెల్లుచే జివురుపాటు ఘటిల్లిన జీవికిన్ మన
స్తాపము పుట్టి సన్నగిలి దైవపుజింతల నక్కిపోవున
ట్లై పలితారుణంపు మిను కాగినమబ్బులు క్రమ్ముదెంచు నీ
మాపులయందు కార్తికికమాఃపరిపూతత కొల్లగొట్టెడిన్.

ఇంచినపున్నెపుమ్మలత లీ చిఱువెల్గులత్రోవలెల్ల వా
లించిన కోర్కెచెట్టు గదలించిన కొమ్మలసందునుండి రా
లించిన పూలజల్లులవలెన్ శివభక్తిఫలంబు భావివే
ళాంచితభద్రతావిభవమంతయు గర్భితశక్తి జూపెడిన్.

వల్లడ దోరహత్తుగ బెనంగొనజాలకయున్ వియత్పథిన్
వెల్గులచేత మింటికొసపెట్టిన తారవిధాన దూరముల్
గల్గిన యాత్మదర్శనముఖంబున జూచినత్రోవ లంతటన్
మెల్గిలకొట్టుచున్ వెలసె మిన్నున కార్తికదీపవైఖరుల్.

గోరిక నందిదేవు నిరుకొమ్ములసందులనిడ్డ భూతియో!
పేరిన శీతలీభవదభీష్టదశైవదృగంత రేఖయో!
శ్రీరజతాద్రికొమ్మదెస చింది విదిర్చిన వెల్గుముక్కయో!
తీరిక బాహులీ గగన దీపికగా గనవచ్చు కంటికిన్.

ఊర్జవియద్ఘటీగతమ్ముదూర్జితదీపపుమందపూతకాం
తార్జవరేఖ ధూర్జటిమహఃపరిభావవిచిత్రదీధితిన్
స్వర్జయసత్యలోకజయ వైష్ణవలోకజయప్రగల్భతా
ధూర్జరమై సనాశివపృథుస్థితికృత్కిరణాత్వ మొప్పెడిన్.

తుదిదటి, చీకటుల్ మలయు త్రోవల చుట్టుల బొడ్డులందు నొ
ప్పిద మగు శైవమా మొదలివెల్గువలెన్ ధ్వజపట్టనందిరా
ద్వదనమణిప్రథ వెలుగుటం జను నియ్యది దివ్యశాశ్వతీ
పదమయి మంచుకొండనుగుపట్టిసమాదృతపాత్రదేశమై.

నక్తము లుండి భక్తులు, కనంబడునంతకు చూచుచున్ వినా
భక్తులు పోయి, లేగునుకుపొందిన నిద్దురపున్నెపుంగలన్
ప్రాక్తనపుణ్యమూర్తి కను, బాహులదీపిక గాంచి తేపులన్
ముక్తవిలోచనాశ్రులయి మోడ్తురు కేలు తమాహమూర్తికిన్.



ప్రాసగదాత్రిశూలకరవాలపినాకధరుల్, మహోగ్రచ
ర్మాసమచేలు, రాననవమచ్ఛిఖనేత్రులు, నర్ధదేహకాం
తాసుకుమారమూర్తులు, సుధారుగుపేతశిరస్కులుం బొరిం
దోసిలులొగ్గి వచ్చి ప్రమథుల్ ఘటదీపికగొల్చుచుందురున్.

భూతాకుంచితపంచకంబు వినయంబుంబొంది నిశ్చేష్టమై
చేతోవ్యగ్రత దాల్ప, శైవపరమశ్రీసచ్చిదానందవి
ద్యాతత్త్వమ్మనకున్ ఘటీశిఖమహోతాదాత్మ్యవనైజభృత
జ్యోతిర్వ్యాఖ్య పొనర్చుచున్నది త్రయీచూడామణిశ్రేణికిన్.

రంభ

[మాట్లాడకుండా ఊరుకొన్న శుకుని రెచ్చగొడదామనుకుంది.]

కోమలమందహాసవినిగూహనచారుకపోలకామినీ
చ్ఛాయమతి లోకమంతటను సర్వుఁడు కాని యొకం డపేతవాం
ఛామతి దన్ దలంచుకొనసాగి సదా అనుభూతిలోభియై
యేమి గడించు, లోక మెలయించిన నేమి ఫలం బయా! ఋషీ!

దేహ మనంగ కోర్కులు జితించినగూడు నిరీహ మన్ భ్రమో
త్సాహములో నెఱుంగకయ దాగిన రోగముగాఁదపోబహు
వ్రీహిభుజిక్రియన్ దిరుగబెట్టును, బెట్టునయే న్మహౌషధుల్
దోహదముల్ వ్యపేతధృతితో బనిసేయవయా! తపస్వికా!

భావము లేల చంపుటకు బాల్పడె దీ ప్రతిచంపువెంట హ
త్యావధిచేరుచున్నదికదా! మఱి మీరలు మానులై యహిం
సావిధియాత్రులుంగద, ప్రశస్తులు, వర్ణి! త్వదీయమౌ తప
స్స్వవధిలో లయాంతశిఖి జిట్టెముకట్టెడు లోకముల్ మునీ!

మానిశలాక! వెన్క నొకమారు త్వదీయుఁడు తాతతాతతో
పూనినవైరి గాధిజుని మొగ్గలకన్నుల మొగ్గలట్లు మా
మేనకసిగ్గులన్ జిలికి మీఁగడచూపులు చూఱలాడె, మీ
మానులతెప్పక్రింది కనుమాయల గోప్యము లేదు మాయెడన్.



తను వొకచోటనుండియు సదాగతియుక్తుఁడ వంతరాన లో
చనములు మూసియున్ నిఖిలసాక్షివి, పల్కకయున్ సమస్తభా
వనిలయబుద్ధి, వీ నియమభావనలో సహజస్వయంప్రతా
రణ మొనగూడియున్నయదిరా! యతిలోకశిరోమణీ! ఘృణీ!

ఒకరుఁ డరుంధతీసతివయోవిభవం బఖిలంబు చూఱపు
చ్చుకయ పతివ్రతాగ్రసరచండిమ గుత్తగొనెన్, మఱొక్కఁడో
డకు తెరచాపనీడలకడన్ బెదరెన్ జలిగాలి వెచ్చ, దా
వకపితరుల్ మునీ! మెఱుగువచ్చినరాతివి నీవు వారిలో.

మసలకయుండు నేమి? యొకమారు కదల్చుము లోనియూహ, మే
ల్మసకపు పాముగా మలకలై దుసికింతలువోవు చూడు మా
నసమును దాటి యాత్మయనినారచె? అశ్రమయీ మనస్సు నూ
గిస లన గల్గునా? తెలివికిం దలదాటినదా! కృతవ్రతా!

లొంగనియట్లె నాపలుకులోపలిచక్కెరపాలు గ్రుక్కిళుల్
మ్రింగెదువో, బెడంగుకను తెప్పలసంపెగపచ్చిరేకు లా
లింగనముఁన్ బొనర్చుకొనులేక సుదమ్ములఁ డేటికూటమిన్
బొంగిన తేనెలో నొలికిపోయిన యీ వల పంటునో మునీ!

[తూర్పులో తెల్లరేకలు తోచినవి.
ప్రక్కన రావిచెట్లఆకుల్లో
ప్రాతర్మందానిలాలు కిలకిలా నవ్వినవి.]

## మాతృస్తవము

నను సృష్టించితి వీవు పెంచితివి పైన న్నీవు నాసృష్టిలో
నన నాదా లయమీ విమిడ్చితివి, కానంగా త్రిశక్త్యాత్మ వే
మనువాడన్ నిను భక్తితో నుభయసంధ్యావేళలన్ హస్తప
ద్మనవీనాంజలు లిత్తు గైకొనగదమ్మా! అంబ! వాత్సల్యమై.

నీవు యశోదవే జనని! నీకరుణాధునిలోన బాలకృ
ష్ణావృతమైన శైశవమహాచపలత్వపుటాటసందడుల్
గా వినినట్లు కొంచెముగ జ్ఞాపకమున్నది విశ్వగర్భగ
ర్భా! వినుతింపగా దగవటమ్మ! మహాపరమైకమూర్తివై.

నీ త్రిలోకైకసమ్మాననీయమూర్తి
స్మరణాతగిలిన హృదయసంభరితమైన
జనని భాగీరథీనదీజలతరంగ
దివ్యపుణ్యావగాహసందీప్తి నాకు.

హేభాగీరథి! కోపగించకుము తల్లీ! నిక్కముం దాచు టే
లా భావ్యమ్మగు శాంకరీచరణలీలారాగమందుంబలెన్
నా భావమ్మఖిలమ్ము మజ్జననిపుణ్యస్వర్గవాంఛారతిన్
నీభక్తిన్ జలియించెడున్ శివజటానీకోర్మిమాలాకృతీ!



శీతగాలికి జెల్లుపూత యత్కించిదా
నతము స్తమై సదాకృతివహించి
ఆనీతనాకసౌఖ్యమ్ము న్యగ్రోధపా
దపము పథశ్రమ మపనయించె
సమిధ లేరెడు బ్రహ్మచారి [illegible]
టరము శుకాలాపసరణి [illegible]
ప్రాతరు[illegible]బాంధవశక్తి
గంగాతరంగసంక్రాంత [illegible]

వజ్రగింజలు కొనముక్కు [illegible]
మొదలు [illegible]
దవిలి యందిచ్చుచున్నది తల్లిపక్షి
తల్లి! నీ విశ్వరూపమే యెల్లయెడల.

# మా గ నో ము

తియ్యపుగింజలన్ జిగురుపేడిన గంధపుపచ్చిబొట్టుతో
తియ్యని చిన్ని నీనొసలితీరులు కుంకుమతీర్చి ముంగిలన్
తొయ్యలినాముచారికలతో బసపాడిన ముద్దరాలు నీ
పయ్యెద వ్రాల నీవు నతిపట్టిన దీవన లీయజూచెడున్.

నీ తెలిపట్టుచీర మెయినీడలు పారి ముసుంగు సంజ క్రొం
బూతల తెల్ల లేమొగిలు పోలిక వాలిక గాలిదూలి పో
నేతబెడంగుకుచ్చెలలు నీచిఱుకాళుల ముద్దుతోచెనో,
లేతపొరాడుపయ్యెద చలించిన పచ్చనితాళి తోచెనో.

దూసిననాగమల్లికల దోసిళులన్ తొలిజాముప్రొద్దు దా
మూసిన కంటిమూత తెరుపుళ్ళయినట్టివి మందహాసక
న్యాసితఫుల్లగల్లపరిణామము లచ్చపవళ్ళ శారద
శ్రీసము పేతముల్ పులకరించెను నీమెడగందపూతలన్.

కమ్మనిపాలబుగ్గ వవుగా పతికోసమ యిన్నినోములున్
కమ్మనకుండ నోచెదవు కేవల మాతని నీమెడంద క్రొం
దమ్మిపువుందుమారములు దమ్మిన చిక్కని తేనెపాలలో
కమ్మలయూటలన్ మెదపి చేతువా నెయ్యపు తియ్యముద్దగా.



ఓసి! మనోజ్ఞ నీరదనవోదయకాలవియద్విలంబమా
నాసితవారివాహనివహోనతకైశిక! మాగనోములో
కోసలుతేరుకన్ దుదలకూడిన భాగ్యపు బెల్లజీరలో
మాసరమయ్యె నీమెడద మాగిననెయ్యపుతియ్యదొంతరల్.

పైదలిచాలులో వ్రతముపట్టిన నీకును తా వొసంగు ము
త్తైదులకాళ్ళ వంగబసి తాకక కన్నులనద్దువేళ నీ
మీద సరాగమాడ బసిమీగడచూపులు నవ్వుపూలు భా
వోదయమున్ బొనర్చియు దలోదరి! నీవ్రతరక్షచేసెడున్.

కొనలకు నూనెరాచి కొనగోళుల దువ్విన కొండెచుట్టు చు
ట్టిన వదులైన క్రొంజడఘటించిన మొల్లనిపోకబంతిలో
నిను నెదురైన కుంకుమపునీటులు గుల్కెడు మోముకన్నె నే
మని నుతియింతు బ్రాతరమృతాకృతిఁగార్యఫలోన్ముఖత్వమున్

వినయము నేర్చుకో జదువబెట్టిరి, మైదువలైనవారి ద
ర్శనసుకృతంబు నిత్యపరిసంగతి దెచ్చిరి, యింతనుండి మా
టనియమ మభ్యసింపఁ గవటాకును నన్నియమించి రీవు తె
చ్చిన పతిశీలతాధికతచే దెలుఁగుల్ పరిపూత లౌటకున్.

నీనడయాడు త్రోవలు పునీతములైనవి, నీదృగంతరే
ఖానతవాయువీచిక లనంతసుధాపరిషేచనక్రియా
స్థానములైన వోసి పసిదాన! భవన్నియమప్రభావసం
ధానముచేత నీపతి సుధామయమూర్తి సముజ్జ్వలించెడున్.

మసృణసుగంధకుంకుమవిమర్దితవక్షులు, ఫాలభాగసాం
ధ్యసమయచంద్రబింబపరిదర్శితసత్తిలకాభిరాము ల
వ్యసనముఖారవిందులు సమంచితనూతనవస్త్రధారులున్
పసగల పాలెగాండ్రు నిలువంబడి రయ్యజమానిముంగిటన్.

గృహిణీదత్తములైన ధాన్యమును సంప్రీతిన్ భుజించెన్ ముహు
ర్ముహురానందతరంగచాలితములై మోరల్ తటాయించి, ది
క్కుహరంబుల్ పగిలింపగా వృషభముల్ క్షోణీధ్రముల్ వోలె ని
ల్చిహ్వాళోన్మత్తదిగంతనాగబలముల్ చేసెన్ మహాధ్వానముల్

ఈవృషభేంద్రముల్ నిలువ వింతయునున్ దలత్రాళ్లుడుస్సినన్
జోవు దిగంతభూములకుబోలె కనంబడు, చేయి వేయగా
నీవు శరీరమం, దెగిరినృత్యము చేసెడు మాపొలాలలో
స్థావరమయ్యె లక్ష్మి సముదారత నీ వృషభంబులానచే.

మ్రాయురె! దిగ్గజాభములు మత్తములియ్యవి యెంత పిల్లలై
పోయెను వల్లె కాళ్ళబడి ముద్దులుగుల్క హసన్ముఖాబ్జయై
యీయజమానికూతురొకయించుక చంచలయాచు గందమున్
పూయగ బస్పుకుంకుమము పూయగ రా నతిశాంతమూర్తులై.

ప్రత్తివిత్తులు తిని నిలంబడి జగజ్జ
యాంకరమ్యభీకరముగ అంకె వేయు
నీ వృషభములు కోటేరునెత్తినాము
చెలగి పరుగెత్తు తూరుపుపొలములందు.



కొబ్బరిముక్కలెల్ల దిని కుఱ్ఱలు మోదమహాబ్ధిమగ్నులై
యుబ్బిరి సందడించి పవనోర్ముల మోహనమయ్యె చిన్నిక్రొ
మ్మబ్బొబ్బకరుండు ప్రాచిదెస మంజులనీలిమ దాల్చె 'కృష్ణ' మా
యబ్బ! జొహార్జొహారనియె నంతట నయ్యజమానిభార్యయున్.

అంకెలువేయు నీ వృషభరాజము లాగవు తుమ్మకొట్టి సా
లంకృతమై పసందెసగు లాంగలమున్ వెస పన్ను ముండెలే
వేంకటనేత శ్రీమధురవీక్షణరోచులవాడు తేనియల్
సుంకముపట్టగా మనలజూచు కృపాతరళేక్షణంబులన్.

కాలిడిన ధాన్య మబికెడు
బోలెడు బుధవారమందు పుట్టె నితడు మా
పాలేరు గడపద్రొక్కను
పా లేత్రై దొడ్డిలో బ్రవాహము గట్టెన్.

మర్దితమయ్యె పాపములు మానుగ మీదయచేత నో బలీ
వర్దములార! ధర్మము భవత్కృపచేతనె సాగుచుండె, కా
పర్దిజటాసుధాంశుహిమబంధురరుక్కమనీయదేహముల్
కర్దమలిప్తలాంగలముఖంబు భవత్కృప వాడిచూపెడిన్.

మెలపుగ మీరు మేఘములమీదన పోదురు,కొంచె మాగుడా
నిలచి యొకింతపొందు ధరణీస్థలి లాంగలపద్ధతిం బడన్
పొలుపుగ వేదబుక్కులుమిమున్ నుతిచేయునటమ్మ! మీభుజా
బలమున బెళ్ళపెళ్ళలుగ వచ్చెడు ధాత్రి ప్రసన్నమూర్తియై

## ఉత్తరపు మిన్నులు

వపు రనలుండు తమ్మిపువుబందుగుకట్టిన బండిగుఱ్ఱముల్
విపులపుకాలిగిట్ట లొరిపిళ్ళకు మిక్కిలి వెట్టమెక్కి అం
వపుపాడివోని సన్న తెలిమబ్బులసందులనుండి జారి వ
చ్చు పగులుకొండ కార్తికపుఁజొక్కులుపోవగ నీదుజీవులన్.

చిలచిలరేగుచున్ బాగలుచిమ్ముచు నుచ్చెడు నాసలందు నా
విలముగ నుత్తరంపుదెస వెట్టిన ముట్టెలఁగట్టు నుర్వ్వాలం
బలెఁ దొలిదిక్కు దూగిన సుమారగు మిన్నున దూలిపోవుమ
బ్బులు నునుపింజలై విరిసిపోయెడు గాలికి నూగిరేగుచున్.

క్రుమ్మిన మింటిమార్గమునకున్ నడిపట్టున నిల్పినట్టి యం
త్రమ్మునఁ బొల్చు పెన్మొసలి దౌడల చేటలవంటి జంట అ
పమ్మ్మలవంటి దంతములమధ్య విశీర్ణములైన వెల్గు దూ
లమ్మ్మలవోలె జారెడు నిలాతలమందు వివస్వదంశువుల్.

తేలను దివ్వెలుంచి కబరీసుమగుచ్ఛలు పేరటాండ్రు నాం
దోళితదేహలై చలికి దుప్పటులన్ ముయిఁగప్పుకొంచుఁ బల్
లాలితవీథివీథి సకలంబును మ్రుగ్గురథాలు తీర్పగా
హేళియు వచ్చి వానిపయి నేగెడు రాగమనోజ్ఞమూర్తియై.

మొఱయికమాలి యార్నెలలుమూసిన సౌరపురీకవాటముల్
తెఱచిన కిఱ్ఱు, నుత్తరపుదిక్కునకున్ మఱలించినట్టి తా
మరపువు నేస్తుబండిరుసు మాలుగుమూలుగు, మేలుకొన్న యా
సిరిదొర యావులింత, విరచించిన రావము నిండె మిన్నులన్.



## శుభకృత్తు

ఒక్కటిరెండుమూడుమతి యొప్పుగ నాలుగునైదునారు నే
డిక్కరణిన్ గణించుచును యేగివలక్షలు కోట్లు సర్వదా
లక్కటరోజరోజ గతమైన దినంబులు లెక్కచెప్పఁగా
నొక్కనినోరుపట్ట దిక నోపదుపో వ్యవహారకాలమున్.

క్రమమైనసంఖ్యయుదీర్ఘమైన కొలఁదిన్ సంఖ్యాంతదేశైక సం
ఖ్యముగా వాడుదు రట్లు వాడుటయు సంఖ్యాదైర్ఘ్యమేపార చి
త్తమునన్ నచ్చదు ధీవిశాలురు యథార్థత్వంబు సౌలభ్య ము
త్తమతంగల్గుపథంబుపట్టి పెరర్థ్యల్ వాడుకన్ ద్రోయఁగా.

కాలములెక్కపెట్టక జగద్వ్యవహారము సాగదెప్పుడున్
కాలములెక్కవెట్టుటకుఁ గానొదుగున్ శతశఃకణంబులై
చాలుకణంబులందెసఁగు సామ్యముగల్గి గతాగతక్రియం
బోలి కణంబుకల్పములబోలె మనంబులగూడ గన్పడున్.

పెరిగి యుగాలు కల్పములు పేర్చినయట్టిదినాలుకాదె యం
బురుహహితోదయాస్తమయమూలముకాలము తొట్టదొల్తవి
స్ఫురణదినాదిగాఁగలిగి పోవుకొలంది దినర్తుమాసవ
త్సరములదాక లెక్కగొని తానట నంకెలలెక్కకై దిగున్.

కొన్ని గడియలు దినములు, కొన్ని దినము
లొక్క నెల, కొన్ని నెల లవి యొక్క వత్స
రమ్మై సరిపోయినది వత్సరములు కొన్ని
యరయ నిదియు నస్పష్టమే, తెరువు లేదు.

వండ్లు మొదలుపెట్టి యిన్ని న్యర్బుదములు
నిన్ని కోట్లు లక్ష లిన్ని యిన్ని
వేలు వంద లనుచు వెసరోజురోజును
బేరుకొంచు నెవడు కూరుచుండు.

ఇవి యిన్ని కలసి యిది యను
వివర మ్మెడాదితోడ వేగఁ జనంగా
నవు రా, జనములు శకముల
నవగణనము మొదలుపెట్టినా ర్నవమతులై.

కాలగమనంబు దానిలక్షణము ఘటిక
లును దినాల్ నెలల్ ఋతు సములునుగఁ గాక
కాలగమనలక్షణపరీక్షావిపక్ష
మైన దీ లెక్క శకములదైన లెక్క.

కాల మ్మది గ్రహచారము
మూలముగా జరుగుచుండి భూజనులకరీ
రాలపయిన్ భాగ్యముపై
హేలాముద్రలు ఘటించు చేగుచునుండున్.



అరయగ నేండ్లసామ్య మొక డారసి రార్యులు వత్సరంబులం
దరువది యర్వదై యొకటి యన్నది కాలముయొక్క రూపమే
పరగ నదే యదే తిరిగి వచ్చుట యర్వది యర్వదై సమల్
మరిమరి యట్టులే చనుట మానవభాగ్యమునన్ సమానతన్.

ఆయా వత్సరములకును
నాయా నామంబులిడిరి యా లక్షణముల్
ప్రాయికముగ దీపింపఁగ
నీయది శుభకృత్తు వచ్చె నిప్పుడు మరియున్.

మనయుద్యోగములున్ మరిన్ మనము నస్మద్లౌకికప్రజ్ఞలున్
తనరం జేయుటయే శుభం బనుచు నేతత్కాలపుంమూర్తి యెం
చునొ, లేకన్ శుభమింక నున్న దొకడంచున్ వేఱ యూహించునో
మనమున్ గాలమయున్ జగత్ప్రభుని సంప్రార్థించుటే యొప్పెడిన్.

## యువాశీస్సు

నవకోకిలకంఠకుహూవు
చిగురులలో రాగ మెల్ల చెరలాడినదో
చిగురెత్తు భావపరిణతి
యువరేఖారసవిధాన మొలికించె నహో!

వేపపూతలకు పూవిలుకానిములికి త
నమ్ము పొందనివిధానమ్ము జూచి
సాయంసమయమంద చారుమారుతములోఁ
సన్నగిల్లిన శైత్యసరణి జూచి
కోమరుపీసరవోవ గ్రమముగా ముదురెక్కు
చున్న లేజివురాకు చిన్నె జూచి
మొగిలు లేఁదనుకైన దగులని గగన మా
ర్గమున వచ్చిన వేడిగాలి జూచి

అరనిదురలోన దనప్రియురాలిదైన
బిగిసడలుచున్న కౌగిలివిధము జూచి
విగతభావభవాదృతి నెగయు నూత్న
యువవిలాసమ్ము లోకశోభ నొలుకబోసె.



ధృతి నిమాందీని, పూదేనియల్ త్రావెనో
ఈ తుమ్మెదలక్రోవి కింత తావి
చెలగి 'జహంగీరు' చిగురాకు మెక్కెనో
ఈ కోకిలపుపాట కింత తేట
సౌఖ్యమిచ్చెడుమాత్ర చలి చిక్కబట్టెనో
ఈ గాలితెరపాట కింత సీటు
ఆయుఃప్రమితి దనయందు నిండించెనో
ఈ వేపక్రొంబూత కింత సేత

భావపరిణతికలయువాభ్యర్చనీయ
మైన యీ తెన్గుతోట పూదేనెయూట
యువమనోహారకుసుమమధూర్మివలయ
కమ్ము లీ తెన్గువనులు రసమ్ము గనులు.

ఉక్కబోయకయుండ నొగి నుల్లిపొరవంటి
చలువజేసిన క్రొత్తవలువ దాల్చి
తనయంద మెల్లదిక్కుల గుబాళింపగా
గమ్మగంబూరమై గంద మలది
వెడదయౌ కనుదోయి విశ్వసుందరముగా
కప్రంపు కాటుక కనులదీర్చి
త్రైలోక్యవిజయగర్వచ్ఛాయ తోచు నం
దంపుమోమున లేతనవ్వమర్చి

మధురభావమ్ములే మూర్తిమలచినట్టు
లున్న కాంతాసమూహమ్ము లుభయపార్శ్వ
ముల బరాబరుల్ సేయ శ్రీముగ్ధమూర్తి
కుసుమబాణుండు పూదోట గొలువుతీర్చె.

ఇవి చిల్కపల్కులో, పువుముల్కి దొరకాలి
గండపెండేరమ్ము కదలుసడియొ
ఇది పికీగానమో, మదనదేవునిపార్శ్వ
చరకన్యకాగళస్వాదుమధువో
ఇది చివురెఱ్ఱనో, యిందిరముద్దారు
కొడుకుకన్నుంగవ కొసరుకెంపొ
ఇవి తేనెవాకలో, చివురాకునడిదంబు
వానియాకారసర్వస్వఖనులొ

అలరు తోటలనెల్ల యువాభిరామ
మూర్తి పరిణతభావసమ్ముగ్ధమూర్తి
కుసుమశరదేవతామూర్తి గోచరించె
తెనుగుతోటల నాశీర్వదించునట్లు.



## ఆశ్వయుజము

మల్లికాసుమపరీమళమిళద్గరుదంత
ముల వీచె బ్రియురాలిఁ బోతుతేటి
సారణీజలపాతధారావిశీర్ణశీ
కరముల న్నించె సింగంపుబోటి
బహుమక్షికాయాతబాధానివారణో
పాయమై పరువెత్తె బడుచులేటి
గునియునీగల దట్టుకోలేక ముంగాళ్ళ
లో గ్రుచ్చుకొనియెభల్లుకముత్రోటి

అల్లనల్లన తెక్క లల్లార్చి చిలుత
పరువులను వీచికొనియెను బక్షికోటి
అడవిలో రేల నుక్కకు నదిమి గాలి
చట్టగట్టినయట్టి యాశ్వయుజవేళ.

చామరమ్ములు దీపసంతతి చెడిన వి
ద్యుద్ధార యాగిన దోసగువలన
కొడిగట్టి పొగగ్రమ్ముకొనిన లాంతరువత్తి
యెక్కని దిగనట్టి చిక్కువలన
ముకుపుటంబుల శ్రవఃపుటముల గన్నుల
జెరలాడు నుసమలసిలుగువలన
ఆడుచున్నతువాల యాపగారానట్టి
రువ్వుచే జేతులనొవ్వువలన

పరమనాగరమైన కొంపలను, బట్ట
ణముల జనములు మిగుల తంద్రాళులైరి
ప్రక్కకుదురదు కడుపులో బరువుగాలి
చట్టగట్టినయట్టి యాశ్వయుజవేళ.

దూషితదానవప్రకృతిదోషనివారులు చంద్రకాంతిగం
ధూషములున్ త్రిలోచనుకుటుంబిని హాసము లడ్డబాస శై
శీషసుమాంశుకాంతి వివరించిన వెల్గులగుత్తు లాడగా
మాషములైన యాశ్వయుజమాసపుతొల్తటిరేలు పొల్చెడున్.

కాళవిరోధులై వరదకట్టల నేళ్ళులు పొంగ మానవుల్
వేళితముల్ జ్వరంబులును వెక్కసమందగ వేల్పువెజ్జు లా
కాళపువీధి నేగెదరు కట్టినజంటగ పూర్ణిమానిశా
ధీశుని యొక్కనాటి తమ తెచ్చినరోగము లేమి చూడగన్.

పట్ట్రేలుడుల్ గాకుండ బగులవిడుచు
విచ్చు పచ్చని వెల్గులవిభవమునకు
నరకదైత్యమృతిస్మృతినాటిబెంగ
పట్టుకొన్నది మఱి యమావాస్యనిశను.



## వైశాఖము

పులకల్ కూర్చెడు మొగ్గమల్లియలతావుల్ గ్రీష్మమధ్యాహ్నబం
ధులు రాగా పరిభుక్తచూతఫలగంధోదారవేళాపరీ
మళనాసాభరమై మహోష్ణపవనమ్లానాననుల్ బిట్టు కౌ
గిళులన్ బట్టుదు రార్ద్రివృత్తులు పికీగీతానుకూలంబుగన్.

కణముల్ గా నడిమింటి సూర్యకిరణగ్రామంబు లాగ్నేయముల్
తోణకన్ రోదసి నింటిచావడులయందున్ బండుకొన్నట్టి కం
దణపున్ మైముడులన్ సడల్చుకొనుచున్ దాళీఫలాంతస్థచి
క్కణసారాతము లారగింతురు మరిన్ గ్రామీణజిహ్వారుచిన్.

సఘనీకంబగు స్వేదమొప్ప బరభాషాదండయాత్రాపరి
శ్లథబంధంబులు తెల్లుపద్దెములునా శయ్యాగతుల్ దంపతుల్
వ్యధితాత్ముల్ బయిచీరలన్ విసరుచున్ బట్టీమరిన్ బట్టన
ట్టి ధృతివ్యాహతనిద్రలన్ నిశలపొంటెన్ బొందుచున్ గుందగన్.

చలిదేశంబులముద్రగా నొడలివస్త్రంబున్నియై దండమూ
ర్తులు నుద్యోగులు శీవియై మొడదలందుర్ వేడిమిన్ నించుకోన్
వలిపంపుర్ నునుజీరలం దొలచుచుర్ వక్షోభవస్వేదవృ
త్తుల శయ్యాభితాత్మదేహలగుచెందుర్ బొల్తురుర్ బొల్తుకల్.

నిలువా వేగముచే దలల్ తెగిన మొండెంబుల్ బలెన్ వెచ్చగా
లులు చంద్రోదయమయ్యు సాగినడకల్ లోపింప వంభోవహం
బులు మైతీగెలు తూలిపోయెడు మహాంబుంబాసి వేసారు ప్రా
ద్దులు దిద్దుల్ బలె బొల్చు తారకలచిందుల్ స్వేదవార్బిందులై.

క్రొంబసుముల్ కపోలములు గోళ్ళను నొక్కకనొక్కినట్టి గా
సిం బురుణించుచుండ జిరజీవిసమూహకభుక్తముక్తముల్
నింబఫలార్ద్రబీజములు నిండిన దా బెర దూడ్చి వెండికం
చంబులు పెట్టి భోజనముసల్పుదు రద్దమరేయి నంగనల్.

నవవై శాఖశరత్ప్రసూనశరకాంతామల్లికాచాపబాం
ధవదిగ్వాయుపరీమళంబులకు బౌనఃపున్యముల్ నూత్ననూ
త్నవధూభావములన్ లిఖించెడిని బంతంబొప్పగా దమ్మిలే
బువుక్రొంబుట్టువు భూర్జపత్రనిభముల్ పూబోడి చెక్కిళ్ళపై.

ఎగచున్ స్వీయసరస్వతిన్ బరులసాహిత్యంబుపై నీగవా
లగనీ దా గతి బశ్చిమానిలము వేళా శైత్యముం గాంచ దీ
తొంగరున్ సంజల వట్టివేళ్ళపయి జిందుల్ ద్రొక్కుచున్ బ్రామికో
నిగ తాళించు కృతాభిషేకగుణసాహిత్యానికిన్ బానిసై.

విమలనిశీధినీమధురవేళల వెచ్చనిగాలులందు సం
భ్రమపడు గాముకుండు పరిపాలితమన్మథ: త్రివృత్త్రిపూ
వుమొగడలం బ్రియాసితకపోలములందున బూయు పచ్చగం
దము తడియారిపోక యెడదంగల యార్ద్రితచే నెఱుంగకన్.



## భాద్రపదము

గుంపులుగుంపులై గగనకూటపుటెల్లల వొల్చు మవ్వపున్
శంపలవంపు లేసొగసుచాళ్లుహరించె మొగిళ్లు దట్టమై
జంపిలి నద్దెసల్ మొరసె జాపులవేసగికాకతీరె సై
రింపులులేని గంధఫలిరేకలు జోకలుదాల్చె నీయెడన్.

చలికోర్వదక్క పంచల కుంచుకొని నిల్చు
పిల్లమేకలొడల్లు జల్లుమనియె
దారిపోయిన పాంథు తాళపత్రచ్ఛత్ర
శిఖరాన చినుకులు చిటపటనియె
నేల పూవుంబోణి నెలలుగా గర్భాన
నిల్పినకాకపో నిశ్వసించె
పడెలలో నిల్చిన వారి గోరంక చ
క్రీకృతాంగమయి పరిభ్రమించె.

మసకమసకై నయాకాశమండలమున
జలమహాధార లోహారిసాహరయ్యె
ఇదియు నున్మాద మెత్తించునేమొ నాకు
పరులు మెచ్చక పాడించి భాద్రపదము.

జలజబాంధవునిదర్శనము కాలేదని
మాయమ్మ చూచు ద్యోమండలమున
ఆమె భోజనముచేయదు లోకబంధు ద
ర్శించి, వాని నమస్కరించికాని
బుడిబుడింగిన పిల్లమూకలు వానలో
పరుగెత్తి యింటిలోపల నిలుతురు
కిలకిలనవ్వుచు క్షీరపారావార
మథనవేళామహామందరనగ

పాదసంభూతదివ్యామృతోదయంపు
పై మిసిమివోలె — కమలినీభామ మొగము
ముడుచుకొనుట మాపిల్లలమురువునవ్వు
కోలమొఁగములు గాంచి సిగ్గుపడెనేమొ !

సిగ్గులపుల్కలై మొగలుచిన్నెలు చిక్కని నవ్వులై యొడల్
నిగ్గులు లేపయంట వెలినిండగ మెత్తనిపూలు పూపలున్
మొగ్గలు కొండకన్నియకు పూజలొనర్చగ సందడించు లే
బుగ్గ తెనుంగుకన్నె యలమున్ తఱి చూపులు క్రొమ్మొగిళ్లలో.

ప్రాపై క్రమ్మ పయోదమాలికల వర్షారమ్యపుం జల్లులం
దేపుంబొందిన పూవుదోటలను తానే పూపపూబోడి గా
రీపూజార్థము కోసిపోవ నొడిజాఱెన్ చంద్రకాంతమ్ము లా
యీపర్యంతము మార్గమందు గిరులయ్యెన్ వాసనాశ్రేణికల్.



మొలకల్ సిగ్గులు గూడబట్టుకొని మున్ముందాచు ప్రాభాతవే
ల గోరంటలమూగు కన్నెలకపోలంబుల్ చెమర్పించె నా
పలలో నంబుకణంబులన్ జిలుకుచున్ గోరంట బంగారుకం
దెలయార్ద్రింబయి గోరునొక్కులు చెమర్చెన్ పూర్వసంస్మృతిన్.

మ్మెరపోయి చెక్కులస్రవన్మదవారికషాయవాసనన్
మ్మనిమూగు మాధుకరసుందరమాలికకర్ణతాళవృం
మ్మున జోపునట్టి ద్విరదమ్ములు తుండము లెత్తి యీ వనాం
మ్ముల వ్రాలుచున్న జలదమ్ముల నేలకు లాగజూచెడిన్.

లలు ప్రవహించు కొండకొమ్ములను జూచి
దానధారల ద్విరదయూథమ్ము జూచి
నిత్యవిభ్రాంతిదినములు నిశలు నొకట
నృత్యమయ్యె శిఖావళానీకములకు.

కావిసంజల తేలిక మొగిళ్లగుంపులో
దాగికొన్న దన ప్రత్యక్షమగుచు
స్వీయాంశువుల పయస్సింధుపూరమ్ము క
ల్పించు నీపూపజాబిల్లి రేక
ఆత్మజకృతతర్పణాంధోభిలాషభూ
స్థలి జేరు పితృదేవతల ముఖాబ్జ
సంతోషమందహాసజ్యోత్స్నయును వోలె
విరిసె నీ జాబిల్లి వెల్గుదెసల

శివశిరస్థగాంగఝరీవికసితజలేజ
దివ్యకాంతి యీ పూపచందిరుని వెలుగు
కలితనీహారగిరిరాజకన్యకాప్ర
సారమధురిమ దీని జ్యోత్స్నానిరూఢి.

మాయూరిగోగోపమార్గమ్మునందున
నిరుగడలందు వాసించుచుండె
శ్యామముగ్ధాకారసౌందర్యలక్ష్మి యనా
మొగిలి క్రొంబొదపైన బుగులుకొన్న
చిన్నారిపొన్నారికన్నె గేదగిపూవు
చలువ చొక్కంపుతావులకు తావు
శబరకన్యామణికబరీభరంబుపై
దాల్చిన కొమ్మెన్గడంతమనగ

ఈ పథమ్ముల వెన్నెలరేయిలందు
చంపకవినూత్నవాసనాఝరిణులందు
ఏ మహాప్రేమదేవత లిచట జేరి
దివ్యభోగమ్ము లెలమి పొందెదరొ కాని.

పరిణతజాతరూపపుటపాకశరీరుఁడు రక్తవర్ణభా
స్వరపరిధానశోభితుఁడు సంచితఘోరజగత్త్రయీమహా
దురితతమఃపతంగుఁడు చతుఃకరకీలితశంఖచక్రవా
రిరుహగదుండు విష్ణుఁడు చరించెడు భాద్రపదాధినేతయై.

---